

# బొమ్మరిల్లు

సంపాదకుడు: విజయబాపినీడు

మనిషికి ఎంత తెలివి, ధైర్యం వున్నా, స్వేచ్ఛ లేనిదే ఏమీ చేయలేనంటాడు. అలాంటివాడికి స్వేచ్ఛ అనేది వుంటే అతడు తన అవసరం, సరదాలను బట్టే ఆలోచిస్తాడు కానీ న్యాయమైన వాటిని గురించి మాట్లాడటానికి ముందుకురాడు. దానికి పదవి కావాలంటాడు. అతనికి పదవినిస్తే ఆ పదవిని దుష్కార్యాలకువయోగించటానికి పాల్పడతాడు. వీటిని స్వతహాగా చూసి తెలుసుకున్నవాడు ఒక రాజువద్ద తనకేమి కావాలని కోరుకుంటాడో శ్రీ ఎస్. శివనాగేశ్వరరావుగారి రచన 'బానిస' అనే కరాళకథ చెబుతుంది. ఇంకా ఈ సంచికలోని 'తప్పుశిక్ష', 'ఇల్లాలి సేవ' లాంటి నీతికథలు కూడా మా పాఠకలోకాన్ని ఆకర్షించగలవని ఆశిస్తున్నాము.

సంపుటి: 19　　ఆగస్టు 1990　　సంచిక: 10

విడిప్రతి: రూ. 3.00　　సంవత్సర చందా: రూ. 36.00

# స్వర్గం-నరకం

ఒకసారి పెద్ద భూకంపంవచ్చి విజయపురి రాజ్యంలోని ప్రజలు వేలాదిగా ఒకేసారి మరణించారు. యమధర్మరాజు వారందరికీ త్వరత్వరగా విచారణ జరిపి రాజులు, మంత్రులు, సైనికాధికారులు, వ్యాపారస్థులవంటి వారిని నరకంలో ఉంచి రైతుల్నీ ఇతరవృత్తి పని వాళ్ళనీ స్వర్గానికి పంపాడు.

"బ్రతికుండగా మేమెన్నో ఘనమైన పుణ్య కార్యాలు చేశాం. గుళ్ళు కట్టించి, పూజలు జరిపించి, దానధర్మాలు చేసిన మమ్మల్ని నరకంలో ఉంచి జీవితంలో దైవధ్యానంలేకుండా వృత్తిపనులు చేసుకునే వాళ్ళని స్వర్గానికి పంపించడం న్యాయమా?" అంటూ గొప్ప వాళ్ళందరూ యమధర్మరాజుని ప్రశ్నించారు.

యముడు వారితో, "మీరేం చేసినా మీ స్వార్థం కోసమో పాపభీతితోనో చేశారు. మీ స్వార్థంకోసం ఎన్నో అన్యాయాలు, అక్రమాలు, అధర్మాలు చేసి ఆ పాపభీతితో దేవాలయాలు కట్టించి, పూజలు జరిపించి, దానధర్మాలు చేస్తే అది దైవానికి ప్రీతి కలిగించదు. మనిషికి వృత్తి దేవుడు. మానవసేవయే మాధవసేవ. రైతులు భూమిని దైవంగా భావించి అందులో అహర్నిశలూ ఎండ, వాన, చలి అనక శ్రమించి వంటలు వండించడంవల్ల వారితోపాటు ఎందరికో తిండి దొరుకుతోంది. అలాగే ఇతర వృత్తిపనుల వారివల్ల ఎందరో ప్రయోజనం పొందుతున్నారు. మీరు మాత్రం అలాంటివాళ్ళ కష్టాన్ని దోచి సుఖవడ్డారు. కాబట్టి ఇప్పుడు వాళ్ళకి స్వర్గసుఖాలు, మీకు నరకయాతనలు తప్పవు" అన్నాడు.

బ్రతికుండగా నిజమైన దైవం తెలుసుకోలేక పోయినందుకు గొప్పవాళ్ళందరూ సిగ్గువడ్డారు.

వాణిశ్రీ



వార్తలు - విశేషాలు

# నెల్సన్ మండేలా విడుదల




భారతీయ సంస్కృతికే అవమానంగా భావించబడే అంటరానితనం మన దేశంలో ఒక సాంఘిక దురాచారం మాత్రమే. కానీ జాతి వివక్షత, వర్ణవిభేదం దక్షిణాఫ్రికాలో రాజ్యాంగ రీత్యా చట్టబద్ధం చేయబడ్డాయి. ఇద్దరు గుజరాతీ వర్తకులకు మధ్య వచ్చిన వ్యాపార తగవులను పరిష్కరించడానికి 1893లో దక్షిణాఫ్రికాకు వెళ్ళిన మన మహాత్మాగాంధీ అక్కడ తెల్లవారు నల్లవారిని గురిచేసే దుర్భరావమానాలను భరించలేక అహింసాపూర్వక సత్యాగ్రహాన్ని ప్రారంభించి ఇరవై సంవత్సరాలపాటు అక్కడే ఉండిపోయిన విషయం జగద్విదితం.

అయితే ఆ పోరాటం అంతటితో అంతంకాలేదు. దక్షిణాఫ్రికాలో అధిక సంఖ్యాకులైన ఆఫ్రికనులు నల్లవారైతే వారిని అస్పృశ్యుల్ని చేసి అక్కడి వనరులను అనుభవిస్తూ ప్రభుత్వాన్నేలుతున్నది. అల్పసంఖ్యాకులైన తెల్లవారు. ఆ దేశంలో తెల్లవారికొక న్యాయం. నల్లవారి కొక న్యాయం. ఆంగ్లంలో APARTHEID అనబడే ఈ జాతి వివక్షత విధానాన్ని ప్రపంచ దేశాలన్నీ తీవ్రంగా నిరసిస్తున్నా దక్షిణాఫ్రికా ప్రభుత్వం లెక్క చేయడంలేదు. స్థానికంగా ప్రజలు తిరగబడితే వారిని కఠినంగా, క్రూరంగా శిక్షించే ఆ రాక్షస ప్రభుత్వాన్నెదిరించడానికి అవతార పురుషుడిలా ఆవిర్భవించినవాడే రోలిహిలాహిలా నెల్సన్ మండేలా ఆయన జులై 18, 1918లో దక్షిణాఫ్రికాలోని ట్రాన్స్కై నగరంలో జన్మించాడు. మామూలు స్కూలు చదువులయ్యాక 1938లో ఫోర్ట్‌హేర్‌లోని నల్ల విశ్వవిద్యాలయములో

చేరాడు. విద్యార్థుల సమ్మెకు నాయకత్వం వహించాడని విశ్వవిద్యాలయం ఆయన్ను 1940లో బహిష్కరించింది. పెద్ద లేర్పాటు చేసిన పెళ్ళి నచ్చక ఆయన జోహాన్స్‌బర్గ్‌కు పారిపోయి ఒక బంగారు గనిలో పోలీసుగా, ఒక భాగ్యవంతుడి ప్లీడరు గుమాస్తాగా పనిచేశాడు. ఒక నర్సును పెళ్ళి చేసుకుని తర్వాత విడాకులిచ్చాడు.

1944లో టాంబో, సిసులు అనే వారితో కలసి ఆఫ్రికన్ నేషనల్ యూత్ కాంగ్రెస్ ప్రారంభించి 1950లో దానికి అధ్యక్షుడైన మండేలా దక్షిణాఫ్రికాలో జాతి వివక్షత విధానాన్ని నిరసిస్తూ 1952లో ఉద్యమం ప్రారంభించాడు. ప్రభుత్వం ఆయనపై దేశద్రోహ నేరాన్ని మోపింది. ఆ నేర విచారణ జరుగుతున్నప్పుడే జూన్, 1959లో మండేలా విన్నీ అనే సంఘసేవికను వివాహం చేసుకున్నాడు. 1960లో ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్ నిషేధించబడి ఎమర్జన్సీ విధించబడింది. మండేలా న్యాయస్థానంలో పోరాడి అన్యాయంగా అరెస్టు కాబడిన నల్లవారెందరినో విడుదల చేయించాడు. ఆ తర్వాత పోలీసు అత్యాచారాలు మితిమీరగా హింసాయుత పోరాటమే తప్పనిసరి అని ప్రకటించాడు. ఆ కారణంగా 1962లో ఆయన అరెస్టయ్యాడు. జూన్ 12, 1964న అది జన్మఖైదుగా మార్చబడింది. అప్పట్నించి ఇంతవరకూ బయటి ప్రపంచాన్నాయన చూడలేదు. ప్రపంచమంతా ఆయన విడుదలకోసం ఆక్రోశిస్తూంటే దక్షిణాఫ్రికా ప్రభుత్వం ఆయన హింసాయుత పోరాటం మానాలన్న షరతుపై విడుదల చేస్తానంది. భయంకర క్షయ వ్యాధికి గురైనాకూడా ఆయన తన విడుదలకు షరతులు పనికిరావన్నాడు. అలా ఒకటి కాదు, రెండు కాదు, సుమారు 28 సంవత్సరాలు జైల్లో గడిపాడాయన.

కానీ మానవజాతికి కొత్త ఆశల నిస్తూ ఈ శతాబ్దపు చివరి దశాబ్దం వచ్చింది. గత సెప్టెంబర్లో బోతాస్థానంలో అధ్యక్షుడిగా ఎన్నికైన డీ క్లెర్క్ ఈ సంవత్సరం ఫిబ్రవరి 11న నెల్సన్ మండేలాను విడుదల చేశాడు. 71 సంవత్సరాల వయసులో 28 సంవత్సరాల తర్వాత బయటి ప్రపంచాన్ని తిరిగి చూస్తున్న మండేలాలో నవయువకుడి ఉత్సాహం కనపడుతోంది. మానవజాతికే మాయని మచ్చగా, తీరని కళంకంగా ఉన్న దక్షిణాఫ్రికా జాతి వివక్షతా విధానాన్ని మండేలా మన నెల్సన్ మండేలా చేయగలడని ఆశిద్దాం!

'వసుంధర'



# తప్పు-శిక్ష

రామాపురంలో నలుగురు ఉపాధ్యాయులు కలిసి పాఠశాల ఒకటి నడిపేవారు. నలుగురూ నాలుగురకాల చదువుల నెంతో శ్రద్ధగా చెబుతున్నారని ఊళ్ళో అందరూ పిల్లల్ని ఆ బడికి పంపించేవారు.

బెట్టండి. మీకు పుణ్యముంటుంది అంటూ గట్టిగా అరిచాడు.

అప్పటికే బడికి చాలా ఆలస్యమయిందని భయపడిన రాజు కంగారుగా అక్కణ్ణించి పరుగున వెళ్ళిపోయాడు.

ప్రపంచంలో అన్ని జన్మలలోకీ ఉత్తమమైనది మానవజన్మ. అన్ని ధర్మాలలోకీ ఉత్తమమైనది మానవసేవ" అని చెప్పాడు.

ఇది విన్న రాజుకో అనుమానం కలిగి లేచి నిలబడి, "అయ్యా! చదువుకంటే మానవసేవ గొప్పదా?" అని అడిగాడు.

రాఘవయ్య అవునన్నాడు.

అప్పుడు రాజు జరిగింది రాఘవయ్యకు చెప్పి, "అయ్యా! మానవసేవ కారణంగా చదువుకు ఆలస్యంగా వచ్చేడని మీరు రవినెందుకు కొట్టారు?" అన్నాడు.

రాఘవయ్య ఆశ్చర్యపడి రవినడిగి నిజం తెలుసుకుని, "మరి నీవు ముందే ఈ విషయం నాకెందుకు చెప్పలేదు?" అన్నాడు.

[illegible] రు నన్ను ఆలస్యానికి కారణం [illegible] వినయంగా. [illegible] రోజున అనవసరంగా శిక్షపడింది" అన్నాడు.

"అయ్యా! ఆ వృద్ధుడికి సహాయం చేయాలని నాకు తోచింది. అంతేకానీ ఆ సహాయానికి నాకు ప్రతిఫలం అక్కర్లేదు. బడికి ఆలస్యంగా రావడం తప్పు. ఆ తప్పుకు శిక్ష అనుభవించడం న్యాయం కదా! ఎవరికో సాయపడ్డానని తప్పు చేయడం అన్యాయం. అందుకే నేను సంతోషంగా మీరిచ్చే శిక్ష ననుభవించాను" అన్నాడు రవి.

ఇదివిన్న రాఘవయ్య రవిచేసిన మానవసేవకు ఎంతగానో సంతోషించాడు.

"నువ్వు చాలా మంచివాడివి. నీ తప్పేమీ లేదు. తప్పు నాది. ఇక మీదట ఆలస్యంగా వచ్చిన వాళ్ళను కారణం అడిగి ఆ తర్వాతే శిక్ష విధిస్తాను" అన్నాడు రాఘవయ్య.

అంతేకాదు, ఆ తర్వాతనుంచి రాఘవయ్య ఆలస్యంగా వచ్చిన వారినేకాక ఏ తప్పుచేసిన



# గురుశిష్యులు

సోమశేఖరుడు పేరు మోసిన వైణిక విద్వాంసుడు. ముసలితనం వచ్చేక ఆయన తన విద్యంతా అర్హతగల శిష్యుడికి నేర్పాలనుకున్నాడు. తన వద్దకు వచ్చిన వారిలో వీణానందుడనేవాణ్ణి మాత్రం శిష్యుడిగా గ్రహించాడాయన.

వీణానందుడికి భోజనం, వసతి కూడా

చెబితే, "నీకు సాధన చాలదు. కొంత కాలంపాటు ఇంట్లో ఉండి సాధనచేయి" అన్నాడు సోమశేఖరుడు. వీణానందుడేమీ అనలేక ఊరుకున్నాడు.

ఆ తర్వాత సోమశేఖరుడు మళ్ళీ బయల్దేరి వెళ్ళి ఈ సారి అన్ని చోట్లా తానొక్కడే కచేరీ లివ్వసాగాడు. అయితే

పూర్తయింది. నీవు కోరినచోటకు వెళ్ళవచ్చు. నీ
విప్పుడు గురువును మించిన శిష్యుడివి" అన్నాడు.

వీణానందుడు వినయంగా గురువుకు నమస్కరించి, "నాకు తెలిసి మునుపటికీ ఇప్పటికీ నేను కొత్తగా నేర్చినదేమీ లేదు. మీ కంటే మంచి పేరు తెచ్చుకున్నప్పుడు నన్నింకా సాధన చేయమన్నారు. మీతో ఓడినప్పుడు నా విద్యాభ్యాసం పూర్తయిందంటున్నారు. ఇది నాకు విడ్డూరంగా ఉంది" అన్నాడు.

సోమశేఖరుడు చిరునవ్వు నవ్వి, "నాయనా! గురువుకు శిష్యుడిపై పుత్రవాత్సల్యముంటుంది. తొలి ప్రదర్శనల్లో నీకు పేరు రావాలని కచేరీలో నీకు ఎక్కువ అవకాశమిచ్చి నేను తక్కువగా వీణావాద్యం చేశాను. అది నీవు గ్రహించక అంతా నీ ప్రతిభేనని అనుకున్నావు. అందుకే [illegible] రావాలన్నాను. నా ప్రతిభ [illegible] చిన్నాను.

విడిగా నా పాండిత్యం ప్రదర్శించడానికి ఉత్సాహం పుట్టక నా సభలు రక్తికట్టలేదు. ఆ సమయంలో నీవు వచ్చి నన్ను సవాలు చేసి నా పాండిత్యాన్ని వెలికి తెచ్చావు. శిష్యుడికి పేరు తేవాలని జంటకచేరీ చేయడం వేరు. శిష్యుడితో పోటీ పడడంవేరు. పోటీపడి నేను మ్రోగించే వీణానాదాన్ని నీవెప్పుడూ విని ఉండలేదు. దానికి పరవశించి ఆ ఆశ్చర్యానందాల్లో నీ వీణను నీవు విడిచిపెట్టి ఓడిపోయావు. జయాపజయాలు మంచి మంచి సంగీతానికి ఆనందించగల వాడికింక నేర్చుకోవలసిన దేముంటుంది? నిజం చెబుతున్నాను. నాతో పోటీపడకుండా వీణను పట్టావంటే సంగీతంలో నీవు నన్ను మించిన వాడివి. అర్థమయిందా! అన్నాడు.

వీణానందుడు గురువుకు ప్రణామం చేసి సెలవు తీసుకుని వెళ్ళి ఆ తర్వాత నిజంగానే గురువునుమించిన శిష్యుడని పేరు తెచ్చు

గోలపెడుతున్నది గొలుసుకోసం కాదు. తన భర్త కోసం!" అంటూ ప్రయాణీకుల్లో ఒకడు గోవిందుని మందలించాడు.

గోవిందు వెంటనే, "అలాగని ముందే చెప్పొచ్చుగా, అయ్యో నా మంగళసూత్రం పోయింది,

కుంటున్నారో అర్థంకాక గోవిందు మనసులో ఇలాగనుకున్నాడు, "ఇకమీదట నావ నీటి ప్రమాదంలో పడినప్పుడు మనుమల్ని ముందు రక్షించి తర్వాతే బంగారాన్నీ, ఇతర వస్తువుల్నీ ఒడ్డుకు తేవాలి!"



[illegible] అయింది. అయితే వాడు చాలా అమాయకుడన్న విషయం చాలామందికి తెలియదు.

ఒక రోజున గోదావరి వరద నీటిలో పరవళ్ళు తొక్కుతూంటే పదిమంది వచ్చి వాణ్ణి నావ కట్టమన్నారు.

"బాబూ! ఇలాంటి సమయంలో నావ కట్టడం చాలా ప్రమాదం. ఉండుండీ ఉడిగుండీ నావ మునిగిపోవచ్చు. మీలో అందరికీ ఈతవచ్చా?" అనడిగాడు గోవిందు.

పదిమందిలోనూ రామనాథం, ఆయన భార్య తాయారమ్మ తప్ప మిగతా అందరూ ఈతవచ్చు నన్నారు.

"ఇద్దరిని నేనే రక్షించగలను. మిగతావాళ్ళు తమ్ముతాము రక్షించుకోగలిగితే చాలు" అని గోవిందు నావ కట్టాడు.

నీటి ప్రవాహంలో పడి హెచ్చింది. గోవిందు చాకచక్యంతో నావ నడుపుతున్నాడు. కానీ ఉవ్వెత్తున లేచిపడే కెరటాల తాకిడికి నావ అటూ ఇటూ ఉయ్యాలలూగుతోంది.

ప్రయాణీకులందరూ అరచేతుల్లో ప్రాణాలు పెట్టుకున్నారు. అవతలి ఒడ్డు ఇంకెంతో దూరం లేదనగా నావ తల్లక్రిందులయింది. పదిమందీ నీటిలో మునిగిపోయారు. ఈత వచ్చిన ఎనమండుగురూ ఎలాగో ఈదుకుని తీరం చేరు కున్నారు. గోవిందు ముందుగా తాయారమ్మని ఒడ్డుకి చేర్చాడు.

మిగతావారిలో రామనాథం లేకపోవడం గమనించి, "అయ్యో! నా మాంగల్యాన్ని కాపాడండి. నా మంగళసూత్రాన్ని రక్షించండి" అంటూ గట్టిగా కేకలు పెట్టింది తాయారమ్మ.

గోవిందు ఆమెవంక ఎగాదిగా చూసి వెంటనే

గౌతమ్



# పాంచాలి

(గత సంచిక తరువాయి)

స్వయంవర సమయానికి ముందే పాండవులు కాంపిల్యనగరానికి చేరుకొన్నారు. నగరంలోని ప్రహరీగోడకు దించిన పంచ ఒకటి కనిపించింది. అది ఒక కుమ్మరివానిది. పాండవులు తమ నివాసానికి అది తగిన ఇల్లనుకొన్నారు.

కుమ్మరివాడు ఆ బ్రాహ్మణుల కోరిక తెలుసుకొని, కొంతకాలం నివసించడానికి వారికి ఆ ఇల్లిచ్చి, వసతి కలిగించాడు.

ఆ ఇంటిలో నివసిస్తూ పాండవులు కాంపిల్య నగరంలోని బ్రాహ్మణవీధిలో భిక్షాటన చేయసాగారు. వారి కోమల స్వభావానికి, మధురభాషణకు ఆ పురజనులు ముగ్ధులయ్యారు. అక్కడి బ్రాహ్మణుల అభిమానానికి పాండవులందరు పాత్రులయ్యారు. యుధిష్ఠిరాదులు అనవసరంగా మాట్లాడేవారు కాదు. మాట్లాడితే మధురంగా, ప్రియంగా మాట్లాడే వారు. ప్రతిదినమూ నియమానుసారంగా స్వాధ్యాయమూ సద్గ్రంధ పఠనమూ చేసేవారు. వారిని చూచినవారెవ్వరూ వారు క్షత్రియులని శంకించటానికి వీలులేకపోయింది.

స్వయంవర మహోత్సవానికి ఇంకా ఎందరెందరో రాజకుమారులు వస్తూనే ఉన్నారు. ఆ వేడుకను చూచేందుకు ఎందరో మునీశ్వరులు, బ్రాహ్మణులు కూడా నగరానికి చేరుకొన్నారు.

ఆనాడే స్వయంవరోత్సవం. రాజకుమారులందరు ముందుగా వచ్చి యథాస్థానాలలో కూర్చున్నారు. వచ్చిన రాజపుత్రులనందరినీ పేర్కొంటే అది పెద్ద పట్టిక అవుతుంది.

శ్రీకృష్ణుడు బలరాముడు మొదలైన వృష్ణి వంశీయులు, శిశుపాలుడు మొదలైన చేది వంశీయులు, జరాసంధుడు, శాల్వుడు, శల్యుడు, భగదత్తుడు, దుర్యోధనుడు, కర్ణుడు, శకుని, అశ్వత్థామ మొదలైన ప్రముఖ వీరవరులు ఎందరో ఉన్నారు.

ద్రుపదమహారాజు రాజకుమారుల పంక్తిలోనికి

ఉత్పల



వెల్లి మర్యాదగా అందర్నీ పలకరించి వచ్చాడు. పురజనులు, చుట్టుప్రక్కల గ్రామాలనుంచి వచ్చినవారు తమకు ఏర్పరచిన స్థానాలలో కూర్చున్నారు. స్వయంవర మండపం సముద్రం లాగా కోలాహలంగా ఉంది.

ఆ స్వయంవర మండపం నగరానికి సమీపాన పూర్వోత్తరకోణాలతో సమతలమైన ప్రదేశంలో నిర్మాణ మయింది. దానికి నలువైపుల సుందరమైన భవనాలున్నాయి.

స్వయంవర మండపంలో అగరుపొగలు అలముకొన్నాయి. మంగళవాద్యాలు మనోజ్ఞంగా వినిపిస్తున్నాయి. పన్నీటి జల్లులు పడుతున్నాయి. చందనచర్చ జరుగుతున్నది. బంగారు కాంతి గల వస్త్రాచ్ఛాదనం నిండా పూలమాలలు వ్రేలాడు తున్నాయి.

రాజకుమారుల చూపంతా తళతళ మెరుస్తున్న బంగారు తెరమీదనే ఉంది. ఆ సమయంలో పాండవులు బ్రాహ్మణుల పంక్తిలోనికి వచ్చి కూర్చున్నారు. ద్రుపదమహారాజు ఐశ్వర్యాన్నీ, ఆయన జరిపించిన అద్భుతమైన ఏర్పాట్లను ఆశ్చర్యపడి చూస్తున్నారు.

ఇంతలో ద్రౌపది సుందర వస్త్రాభరణాలను అలంకరించుకొని, సువర్ణమయమైన జయమాలను చేతబట్టి, స్వయంవరమంటపం మీదికి వచ్చింది. వెంటనే రాజపురోహితుడు మంత్రాలను పఠించి, అగ్నిలో ఆహుతులను సమర్పించాడు. బ్రాహ్మణులు స్వస్తివాచకాలు పలికారు. సమస్త మంగళవాద్యాలు బోరున మ్రోగాయి. ద్రుపదుని కుమారుడు ధృష్ట ద్యుమ్నుడు వేదికమీదికి వైభవంగా వచ్చి నిలిచాడు.

"స్వయంవరానికి విచ్చేసిన రాజకుమారులారా!" అని అందరివైపు చూసి ఇలా అన్నాడు.

"అదిగో! ఆ కన్పించేదే మత్స్యయంత్రం. అదే లక్ష్యం. అక్కడ అయిదు బాణాలున్నాయి. ఒక మహాధనువున్నది. సత్కులజాతుడు, రూపమూ బలమూ గలవాడు ఆ బాణాలతో ఆ యంత్రంలోని మత్స్యాన్ని ఛేదించాలి. అలా ఛేదించినవాడే నా సోదరికి ప్రాప్తిస్తాడు" అని ప్రకటించి ధృష్టద్యుమ్నుడు అందరికి వినబడే టట్లు తన సోదరివైపు తిరిగి ఇలా అన్నాడు.

"సోదరీ! ఈ లక్ష్యాన్ని ఛేదించిన వానిని నీవు పతిగా వరించవలసి ఉంది సుమా"

పూలమాల చేతబట్టి నిలుచున్న ద్రౌపది దృష్టద్యుమ్నుని మాటలకు చిరునవ్వుతో సిగ్గును ప్రకటించింది.

రాజకుమారుల శ్రేణిలో కలకలం బయలు దేరింది. ద్రౌపది సౌందర్యాన్ని చూచి ఆమెను ప్రాప్తింపజేసుకోవాలని వారందరు తహతహ పడ్డారు. ఒకరినొకరు చూచుకొన్నారు. ద్రౌపది వైపు తమ భావభంగిమలను ప్రదర్శింపసాగారు. ద్రౌపది తమకే దక్కుతుందని బలశాలులు కొందరు ఆవేశపడ్డారు. స్వయంవర మండపంలో వీరోత్సాహం విజృంభించింది.

ఈ మహోత్సవ సందర్భంలో విచ్చేసిన శ్రీకృష్ణుని దర్శించడానికి దేవతలు, గంధర్వులు కూడా మారువేషాలతో వచ్చి చాటుగా కూర్చున్నారు.

శ్రీకృష్ణుడు ఆయనతోపాటు వచ్చిన యాదవ వీరులందరు నిశ్శబ్దంగా కూర్చున్నారు. ద్రౌపదిని పెండ్లాడాలన్న తలంపు వారికి లేదు.

శ్రీకృష్ణుడు బ్రాహ్మణుల పంక్తిలో కూర్చున్న కుంతీపుత్రులను గుర్తుపట్టాడు. వారిని బల రామునికి రహస్యంగా చూపించాడు. కుంతీ పుత్రులు బ్రతికి ఉన్నందుకు బలరాముడు లోలోపల ఎంతో సంతోషించాడు.

ఈ స్వయంవరోత్సవానికి శ్రీకృష్ణుడు నిజానికి పాండవులను గుర్తించడానికీ, ద్రౌపదిని వారికి పట్ట మహిషిని చేయడానికే వచ్చాడు.

తక్కిన రాజకుమారుల దృష్టి అంతా ద్రౌపది మీదనే ఉంది. పాండవులవైపు ఎవరూ చూచినవారు కారు.

తొలుతగా దుర్యోధనుడు, శల్యుడు, అశ్వత్థామ మొదలైనవారు దర్పంగా లేచి వెళ్లి అక్కడున్న ధనుస్సును ఎక్కుపెట్టడంలోనే విఫలులయ్యారు. బెట్టు తప్పి ధనుస్సును పైన వేసుకొని వెల్లకిల పడ్డారు. క్రిందపడిపోయిన కిరీటాలను చేతపట్టుకొని నిట్టూర్పులు విడుస్తూ వెళ్లి తమ స్థానాలలో చతికిల పడ్డారు.

(ఇంకా ఉంది)





# రాక్షసుడి ప్రేమ

త్ర్యికరుడు అనే రాక్షస యువకుడికి తన జాతి పద్ధతులు నచ్చేవికాదు. మానవ కాంతను పెళ్లి చేసుకుని మనుమల్లా జీవించాలని వాడి కోరిక. అది తెలిసిన త్ర్యికరుడి తండ్రి, "నాయనా! మనుమల్ని మనం భోంచేస్తాం. అందుకని వాళ్ళు మనల్ని క్రూరమృగాల్లా వేటాడాలనుకుంటారు. మనకు బలముంటే వారికి తెలివి ఉంది. మనిషి తెలివి మన బలంకంటే గొప్పది. అందువల్ల మానవుల మధ్యకు వెళ్ళడం రాక్షసులకు క్షేమం కాదు" అని కొడుక్కి హితబోధ చేశాడు. అయినా త్ర్యికరుడు వినకపోతే తండ్రి వాడికి బంగారం, విలువైన వజ్రాలు ఇచ్చి, "మనిషి దేనికి లొంగినా లొంగకపోయినా డబ్బుకు మాత్రం లొంగుతాడు. వెళ్ళి నీ కార్యం సాధించుకో" అని వాణ్ణి సాగనంపాడు.

ఆ విధంగా మనుమల మధ్యకు వచ్చాడు త్ర్యికరుడు. అయితే రాక్షసుణ్ణి చూడగానే మనుమల్లో కలకలం పుట్టేది. వాడు స్నేహభావంతో ఎవరిని పలకరించినా ఎవరూ నమ్మకుండా పారిపోయేవారు. చివరకు రాక్షసుడో మనిషిని చేత్తో ఒడిసి పట్టుకుని, "భయపడకు. నేను మానవకాంతను పెళ్ళి చేసుకుందామనుకుంటున్నాను. నేనంటే ఏ అమ్మాయి ఇష్టపడుతుందో చెప్పగలవా?" అన్నాడు.

ఆ మనిషికి ముగ్గురు కూతుళ్ళున్నారు. బాగా పేదవాడు. డబ్బులేక కూతుళ్ళ పెళ్ళిళ్ళు చేయలేకపోతున్నాడు. రాక్షసుడి మాటలకు వాడు ధైర్యం తెచ్చుకుని, "నీ ఆకారం కడు భీకరంగా ఉంది. ఏ అమ్మాయి నిన్ను పెళ్ళి చేసుకుంటుంది?" అన్నాడు.

అప్పుడు త్ర్యికరుడు ఆ మనిషిని వదిలి కామరూప శక్తితో మనిషిలా మారాడు. అప్పుడు కూడా వాడు ఏడడుగుల భారీశరీరంతో మనిషి రాక్షసుడిలాగున్నాడు.

ఆ మనిషి వాణ్ణి చూసి, "ఏ మానవకాంతా నిన్ను పెళ్ళి చేసుకోదు. నువ్వు నీ రాక్షసుల

గుండ్రాతి సుబ్రహ్మణ్యం



మధ్యకు వెళ్ళి నీ జాతి పిల్లని పెళ్ళిచేసుకుని సుఖంగా ఉండు" అన్నాడు.

అప్పుడు త్వికరుడికి తండ్రి మాటలు గుర్తుకు రాగా తనవద్ద నున్న డబ్బు సంగతి చెప్పాడు. అది చూస్తూనే, "నువ్వు నాకో వజ్రాన్నిస్తే చాలు. జన్మజన్మలకు నా దరిద్రం తీరిపోతుంది. నీకు నా పెద్ద కూతురు ప్రభావతినిచ్చి పెళ్ళి చేస్తాను. కానీ నువ్వు మాత్రం రాక్షసుడినని నా కూతురుకి చెప్పకు" అన్నాడు.

నిజం దాచడానికి త్వికరు డంగీకరించలేదు. అప్పుడామనిషి మరో వజ్రంకూడా ఇస్తే తన కూతుర్ని రాక్షసుడితో పెళ్ళికి ఒప్పిస్తానని చెప్పి, "కానీ ఒక్క షరతు. నాకింకా ఇద్దరు కూతుళ్ళు న్నారు. నాపెద్ద కూతుర్ని రాక్షసుడికిచ్చి పెళ్ళి చేశానని తెలిస్తే మిగతావాళ్ళకు పెళ్ళికాదు. కాబట్టి నువ్వు పెళ్ళికాగానే నా కూతుర్ని తీసుకుని ఏ అడవికో వెళ్ళిపోవాలి" అన్నాడు.

త్వికరుడి కూడా తన భార్యతో ఏకాంతంగా గడపాలని ఉన్నందువల్ల సంతోషంగా ఆ షరతుకు అంగీకరించాడు.

ప్రభావతికి రాక్షసుణ్ణి పెళ్ళి చేసుకోవడం సుతరామూ ఇష్టంలేదు. అయినా తండ్రి మాటకు ఎదురు చెప్పే ధైర్యంలేక ఊరుకుంది. త్వికరుడామెను పెళ్ళి చేసుకుని అడవికి తీసు కుని వెళ్ళాడు. అక్కడ వాడు భార్యకోసం స్వయంగా ఎంతో అందమైన భవనాన్ని నిర్మిం చాడు. అందులో ఆమెకే లోటు రాకుండా రాక్షస మాయతో దాసదాసీ జనాన్ని సృష్టించాడు.

ఇన్ని చేసినా ప్రభావతికి త్వికరుడంటే ఇష్టం పుట్టలేదు. ఏ రోజున మనసుమారి రాక్షసుడు తన్ను తినేస్తాడోనని ఆమె భయం. వాణ్ణి చూస్తే చాలు ఆమె శరీరం భయంతో వణికేది. త్వికరు డది గ్రహించి దగ్గరగా వెళ్ళేవాడుకాదు.

అలా రెండు సంవత్సరాలు గడిచాయి.

ఒకరోజు త్వికరుడింట్లో లేని సమయంలో అందమైన ఆ భవనంలోకి ఎంతో అందమైన యువకుడు అడుగుపెట్టాడు ప్రభావతి వాణ్ణి చూసి ఆశ్చర్యపడి ఎవరు నువ్వు అని వివరా లడిగింది. తనకెవ్వరూ లేరనీ, మనుషులంటే విరక్తి పుట్టి అరణ్యంలోకి వచ్చాననీ వాడు చెప్పాడు. ప్రభావతి వాడికి అతిథిమర్యాదలు చేసింది. ఆ యువకుడు తన పేరు రాజేంద్రుడని చెప్పాడు.

కాసేపటికి త్రికరుడు వచ్చి రాజేంద్రుణ్ణి చూశాడు. వాడు గజగజ వణుకుతూంటే రాక్షసుడు ప్రభావతినడిగి వివరాలు తెలుసుకుని, "భయపడకు. నేను నిన్నేమీ చేయను. ఈ అరణ్యంలో నా భార్య సరైన తోడులేక బాధపడుతోంది. నువ్విక్కడే ఉండి ఆమెను సంతోషపెట్టు. నేను నీకేలోటూ రానివ్వను" అన్నాడు.

రాజేంద్రుడు కొంతకాలం ఆ భవనంలో సుఖంగా ఉన్నాడు. కొన్నాళ్ళు గడిచాక వాడు ప్రభావతితో, "త్రికరుడు ప్రస్తుతానికి మంచిగానే ఉన్నప్పటికీ స్వతహాగా రాక్షసుడు. ఏదో రోజున వాడి అసలు బుద్ధి బయట పడక మానదు. దీపముండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలి. మనమిద్దరం పెళ్ళిచేసుకుందుకు వాడి అనుమతి తీసుకుందాం. తర్వాత ఇక్కణ్ణించి వెళ్ళిపోదాం" అన్నాడు.

ప్రభావతికి కూడా క్రమంగా రాజేంద్రుడంటే ప్రేమ పుట్టడం వల్ల అందుకు అంగీకరించి ఒక రోజున రాక్షసుడితో విషయం చెప్పింది. త్రికరుడికి కోపంవచ్చి రాజేంద్రుణ్ణి పిలిచి, నేను నా భార్యకు తోడుగా ఉండమని చెబితే ఆమెను పెళ్ళి చేసుకుంటానంటావా?" అని తిట్టాడు.

"తప్పు నాది కాదు. నీ భార్య నన్ను పెళ్ళి చేసుకుంటానంటోంది" అంటూ రాజేంద్రుడు నెపం ప్రభావతిమీదకు నెట్టేశాడు.

"నిజమేనా?" అన్నాడు త్రికరుడు

ప్రభావతి భయపడకుండా, "నేను మానవ కాంతను. రాక్షసుడు భర్తగా నేను సుఖపడలేను. నువ్వు నా సుఖం కోరితే మా పెళ్ళికి ఒప్పుకో" అంది.



త్రికరుడు కాసేపు బాధ పడ్డాక, "నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నీ సుఖమే నాకు సంతోషం. మీ క్కావలసినంత డబ్బిస్తాను. ఇష్టమైన చోటుకి వెళ్ళి సుఖంగా ఉండండి" అన్నాడు.

అదే సమయానికాయింట్లో మరి కొందరు మనుషులు ప్రవేశించారు. వారిలో ప్రభావతి తండ్రి ఉండడం చూసి త్రికరుడు వినయంగా నమస్కరించాడు. ప్రభావతి తండ్రి రాజేంద్రుణ్ణి చూసి, "నువ్వీ అరణ్యంలోకి వచ్చేవని తెలిసి వెతుక్కుంటూ వచ్చాం. జరిగిందేమిటో తెలుసు కోకుండా నువ్విలా చేయడం బాగోలేదు" అన్నాడు.

అసలు విషయమేమిటంటే రాజేంద్రుడు ప్రభావతి చెల్లెల్ని పెళ్ళిచేసుకున్నాడు. సంగీత మంటే ప్రభావతి చెల్లెలు విభావతికి మక్కువ. రాజేంద్రుడికి సంగీతం గిట్టదు. అందుకని ఆమె ఓ యువకుడి వద్ద రహస్యంగా సంగీతం అభ్య సిస్తే రాజేంద్రుడామె వాడినే ప్రేమిస్తోందని భ్రమపడి ఇల్లొదిలి వచ్చేశాడు.

ఇది తెలిసాక రాక్షసుడు కోపంగా, "నీ భార్య ఓ యువకుడి వద్ద సంగీతం నేర్చుకుంటే అనుమా నించిన వాడివి నీతో నా భార్య ఏం సుఖపడు తుంది? నీతో ప్రభావతిని పంపను" అన్నాడు.

"మీరు పంపినా వీడితో నేను వెళ్ళను. భార్య కిష్టమైన సంగీతాన్నిష్టపడక, అది రహస్యంగా సంగీతం నేర్చుకుంటే అనుమానించే ఈ నీచు డిక్కడకు వచ్చి చేసిందేమిటి? భార్య సంతోషం కోసం ఏమైనా చేయగల మీనుంచి నన్ను దూరం చేయాలనుకున్నాడు. ఇంతకాలం మీరు రాక్షసు లని భయపడ్డాను. ఇలాంటి మనుషులకంటె మీరెంతో ఉత్తములు. నన్ను మన్నించండి" అంది ప్రభావతి.

అప్పటికి రాజేంద్రుడిక్కూడా తన తప్పు అర్థమై సిగ్గుతో తలవంచుకున్నాడు.

ఆ తర్వాత త్రికరుడు ప్రభావతితో సహా మనుషుల మధ్య కలకాలం సుఖంగా జీవించి రాక్షసజాతికే మంచి పేరు తెచ్చాడు.





# బానిస

కుండలిని రాజు ప్రతాపుడు స్నేహశీలిగా సాటి రాజుల్లో పేరుకాంచాడు. ఒకసారి పొరుగు రాజైన సుకీర్తుడు ప్రతాపుణ్ణి తన రాజ్యానికి ఆహ్వానించి విలువైన కానుకలతో పాటు వినమ్రుడు అనే బానిసను బహూకరించాడు.

వినమ్రుడు ప్రతాపుణ్ణి వినయవిధేయలతో శ్రద్ధగా సేవించుకొనేవాడు. ప్రతాపుడు వాణ్ణెంతో అభిమానంగా చూసుకునేవాడు. కొన్నేళ్ళు గడిచేక ప్రతాపుడు తానెక్కడికి వెళ్ళినా వినమ్రుణ్ణి వెంటబెట్టుకుని వెళ్ళసాగాడు.

ఒకసారి వసంతపురి రాజు భీమ్మసేనుడు వసంతోత్సవాలకు ప్రతాపుణ్ణి తన రాజ్యానికి

కరాళ కథలు



ఆహ్వానించాడు. రాజులిద్దరూ చదరంగమాడితే ప్రతాపుడే గెలిచాడు. అలా ఒకరోజు కాదు, వరుసగా నాలుగురోజులు జరిగేసరికి భీష్మసేనుడుక్రోధపడి, "నీకు చదరంగంలో ఉన్నట్లే నాకు రథం నడపడంలో ప్రావీణ్యముంది. అందులో నిన్నోడించగలను" అన్నాడు.

"రథం నడపడంలో నాకున్న ప్రావీణ్యమూ తక్కువ కాదు. నన్నోడించడం అంత సులభం కాదు" అన్నాడు ప్రతాపుడు.

ఇరువురికీ మాటా మాటా పెరిగింది. అదెంత వరకూ వెళ్ళిందంటే చివరకు ఇద్దరూ తమ తమ రాజ్యాలు పందెంగా ఒడ్డి రథాల పోటీకి తలపడ్డారు.

ప్రతాపుడికి పాండవులలో నకులుడికిలా అశ్వశిక్షణలో అద్భుతమైన నేర్పు ఉంది. వాటినతడు సులభంగా, త్వరితగతిని మచ్చిక చేసుకుని రథాలకు పూన్చాక మెరుపు వేగంతో పరుగెత్తించాడు. భీష్మసేనుడెంత ప్రయత్నించినా ప్రతాపుడి రథమే ఎప్పుడూ పదిగజాలు ముందుంటోంది.

ఇక గెలుపు ప్రతాపుడిదే అనుకునే సమయములో అతడి రథ చక్రానికి శీల ఊడిపోయింది. రాజుతో పాటు రథంలో ఉన్న వినమ్రుడు అది సరైన సమయంలో గమనించి తన ఎడమచేతి చిటికెన వ్రేలుని శీలకు బదులుగా పెట్టాడు.

ఆ విధంగా పెద్ద ప్రమాదం తప్పడమే కాక ప్రతాపుడు పందెం నెగ్గాడు. భీష్మసేనుడు తన ఓటమిని మనస్పూర్తిగా అంగీకరించి తన రాజ్యాన్ని ప్రతాపుడికి ధారాదత్తం చేయబోయాడు.

"ఆవేశంలో తీసుకున్న నిర్ణయాలు దేశాన్నేలే రాజుకు శోభనివ్వవు. పందెం మన ప్రావీణ్యతను నిరూపించుకుందుకే తప్ప ఒకరి అధికారాన్నొకరు స్వాధీనం చేసుకొందుకు కాదు. అంతగా నీకు అన్నమాట తప్పానని బాధగా ఉంటే ఈ రాజ్యాన్ని నా కానుకగా స్వీకరించి తిరిగి ఏలుకో!" అన్నాడు ప్రతాపుడు.

భీష్మసేనుడు ప్రతాపుడి ఔదార్యాన్ని, స్నేహశీలతనూ మెచ్చుకుని విలువైన కానుకలతో అతడి రాజ్యానికి సాగనంపాడు. తన రాజ్యం చేరుకున్నాక ప్రతాపుడు వినమ్రుడితో, "నీ తెలివి, ధైర్యం అసమానం. నీకేం కావాలో కోరుకో!" అన్నాడు.

"ఎంత తెలివి, ధైర్యం ఉన్నా స్వతంత్రించి

ఏమీ చేయలేని బానిస బ్రతుకు నాది. ఇతరుల అజ్ఞలకు బద్ధుడినై జీవించే నాకు స్వేచ్ఛను ప్రసాదించండి" అన్నాడు వినమ్రుడు వెంటనే.

"నీతో కలసి మారువేషంలో దేశ సంచారం చేయాలని నా కోరిక. అది తీరేక తప్పక నీ కోరిక తీర్చగలను" అన్నాడు ప్రతాపుడు.

ఆ రాత్రి ప్రతాపుడు, వినమ్రుడు మారువేషాల్లో దేశ సంచారానికి బయల్దేరారు. కాసేపు నడిచేక వారో ప్రాంతం చేరుకున్నారు. అక్కడ కొందరు మనుషులు పెద్ద భవంతికి పునాదులు తవ్వుతున్నారు. ఏమిటని అడిగితే, "ఇది తెలియదా? మారాజు ప్రతాపుడు తనతండ్రి జ్ఞాపకార్థం గొప్ప పాలరాతి భవంతి కట్టిస్తున్నాడు. ఇంత గొప్ప భవంతికి పునాదులు తీయడం మా అదృష్టం" అన్నాడో మనిషి.

ఇది విని ఆ చుట్టు పక్కలే ఉన్న ఓ ముసలి బిచ్చగాడలా వచ్చి, "ఏమదృష్టంలే! చచ్చిన మారాజులకోసం డబ్బంతా ఇలా వృధాచేయక పోతే ఏ ఆధారమూ లేక అడుక్కుతిని బ్రతికే నాబోటి ముసలాళ్ళకేదైనా ఉపాధి కల్పించ కూడదూ!" అన్నాడు.

రాజు అక్కణ్ణించి తిరిగి వెడుతూ, "ఆ ముసలి బిచ్చగాడి మాట సబబుగా లేదూ?" అన్నాడు.

"ఆ విషయం నాకేం తెలుస్తుంది ప్రభూ! ఏ మనిషైనా తన అవసరం, సరదాల బట్టే ఆలోచిస్తాడు తప్ప న్యాయం మాట్లాడడు" అన్నాడు వినమ్రుడు.



"నా తండ్రి జ్ఞాపకార్థం పాలరాతి భవంతి కట్టాలని నా సరదా కానీ ప్రజలకది ఇష్టం లేదని ఇప్పుడే తెలిసింది" అన్నాడు ప్రతాపుడు.

మర్నాడే ప్రతాపుడు పాలరాతి భవంతి కట్టడం ఆపుచేయించి దేశంలో అడుక్కుతినే వాళ్ళందరికీ ఉపాధి కల్పించే ఏర్పాట్లు చేశాడు. ఆ సాయంత్రం ప్రతాపుడు వినమ్రుణ్ణి పిలిచి "నీ కోరిక ప్రకారం నీకు స్వేచ్ఛ నిస్తున్నాను" అన్నాడు.

"వద్దు ప్రభూ! నేను మీకు బానిసగానే ఉంటాను" అన్నాడు వినమ్రుడు.

ఆ తర్వాత కొన్నాళ్ళకు ప్రతాపుడు, వినమ్రుడినీ కొందరు భటులనీ వెంటబెట్టుకుని సమీపారణ్యంలోకి వేటకు వెళ్లాడు. అక్కడ అలసటలో ఆదమరచి నిద్రపోతున్న ప్రతాపుడి మీద పులి

ఒకటి దాడిచేసింది. చేతిలో ఆయుధం లేకపోయినా వినమ్రుడు ధైర్యంచేసి పులిని ఎదుర్కొన్నాడు. ఈలోగా అలికిడికి భటులటుగా వచ్చారు. అంతా కలసి పులిని చంపేశారు కానీ వినమ్రుడు తీవ్రంగా గాయపడ్డాడు. ప్రతాపుడు వెంటనే తిరుగు ప్రయాణం కట్టి వినమ్రుడికి చక్కటి వైద్యం జరిగే ఏర్పాటు చేసి వాడు కోలుకున్నాక, "నువ్వు నాకు ప్రాణదానం చేశావు. నీకేం కావాలో కోరుకో" అన్నాడు.

"ప్రభూ! నాకు ఉన్నత పదవి ఇప్పించండి" అన్నాడు వినమ్రుడు.

"నీ అర్హతను విచారించి తగిన పదవి ఇస్తాను. ఈ ఊరికి దక్షిణ దిశగా ఉన్న కాళికాలయంలో కొందరు దేశ ద్రోహులు సమావేశమై నా మీద కుట్ర చేయనున్నట్లు తెలిసింది. నీవు ఒంటరిగా వెళ్ళి ఆ విషయం విచారించిరా" అన్నాడ ప్రతాపుడు.

వినమ్రుడు సాయంత్రానికే కాళికాలయానికి వెళ్ళి విగ్రహంచాటున నక్కి కూర్చున్నాడు. అర్ధరాత్రి సమయానికక్కడికి నలుగురు మనుషులు వచ్చారు. వారిలో ప్రతాపుడి సేనాధిపతి నాగభూపతికూడా ఉన్నాడు.

"ఒకసారి రాజును ప్రాణాపాయం నుంచి రక్షించాను. అందుకు ప్రతిఫలంగా రాజు నన్ను సేనాధిపతిని చేశాడే తప్ప అర్ధరాజ్యమివ్వాలని అనుకోలేదు. మీరు ముగ్గురూ ప్రజల్లో రాజు గురించి దుష్ప్రచారం ప్రారంభించండి. ఆ తర్వాత రాజును చంపి నేనే రాజునై మీకు ఉన్నత పదవులిస్తాను" అన్నాడు నాగభూపతి మిగతా ముగ్గురితోటీ.



వినమ్రుడు వెనక్కు తిరిగివెళ్ళి జరిగిందంతా చెప్పి, "ప్రభూ! తమరు జాగ్రత్తగా ఉండండి. నేను మాత్రం మీకు బానిసగానే ఉంటాను. నాకే ఉన్నత పదవులూ వద్దు" అన్నాడు

ఆ తర్వాత నెల్లాళ్ళకు నాగభూపతి ప్రతాపుణ్ణి తన ఇంటికి విందుకాహ్వానించాడు. దానికి ప్రతాపుడు వినమ్రుణ్ణి కూడా వెంట బెట్టుకుని వెళ్ళాడు. అక్కడ నాగభూపతి సువర్ణ పాత్రలో రాజుకు ద్రాక్షరసం అందిస్తే ప్రతాపుడది వినమ్రుడికిచ్చి, "నీవు నాకు ప్రియస్నేహితుడివి. ముందుగా నీవే ఇది తాగాలి" అన్నాడు వినమ్రుడు మాట్లాడకుండా ఆ ద్రాక్షరసం తాగి వెంటనే నేలమీద పడి గిలగిల తన్నుకోసాగాడు.

తనమీద విషప్రయోగం ఎప్పుడెలా జరుగుతుందో రాజుకు చారుల ద్వారా ముందే తెలుసు. అందుకని ఆయన రాజవైద్యుణ్ణి, కొందరు సైనికుల్నీ ముందుగానే చెప్పి రహస్యంగా ఉంచుకున్నాడు. వినమ్రుడు నేలమీద పడగానే ప్రతాపుడు చప్పట్లు కొట్టాడు. సైనికులు వచ్చి నాగ భూపతిని బంధించారు. రాజవైద్యుడు వినమ్రుడికి వైద్యం చేసి బ్రతికించాడు.

"ఈ రోజునుంచీ నీవే నా సేనాధిపతివి" అన్నాడు ప్రతాపుడు. వినమ్రుడు మారు మాట్లాడకుండా అందుకంగీకరించాడు.

కరాళుడింతవరకే కథ చెప్పి, "స్వేచ్ఛను, ఉన్నత పదవులను కోరిన వినమ్రుడు బానిసగానే ఉండాలని ముందెందుకు నిర్ణయించుకున్నాడు? ఆ తర్వాత రాజు తనని సేనాధిపతిని చేస్తే ఎందుకంగీకరించాడు? వినమ్రుడి ఈ విపరీత ప్రవర్తనకు కారణం తెలియకుండా



ఉంది. ఓ సవిత్సుక మహారాజా! తెలిసికూడా నువ్వివి నాకు చెప్పక పోతే నీవు నాకు బానిసవు కావలసి ఉంటుంది" అన్నాడు.

దీనికి సవిత్సుకుడిలా బదులిచ్చాడు.

"వినమ్రుడు తను బానిసగా బ్రతకరాదను కున్నాడు. కానీ ఒక దేశాన్నేలే రాజుకూడా ప్రజా క్షేమాన్నికోరి తన సరదాలు చంపుకుని వారికి బానిసగా ఉంటున్నాడని గ్రహించేక సామాన్యులైన ప్రజలకు బానిసగా ఉండే రాజుకంటె, మహాత్ముడైన రాజుకు బానిసగా ఉండడం గొప్ప విషయమని తెలుసుకున్నాడు. స్వేచ్ఛ మనిషిని స్వార్థానికి ప్రోత్సహిస్తుంది. తన స్వేచ్ఛను స్నేహశీలి, నిస్వార్థపరుడు, ప్రజా హితైభిలాషి అయిన ప్రతాపుడి అదుపులో ఉంచి తను నిస్వార్థపరుడు కాకుండా ఉండాలనుకున్నాడు వినమ్రుడు.

"ఒకప్పుడు రాజు ప్రాణాలు కాపాడి నాగభూపతి సేనాధిపతి పదవికి వచ్చేక అత్యాశాపరుడై రాజు ప్రాణాలే తీయాలనుకున్నాడు. మనిషిలో ఔన్నత్యాన్ని పెంచని పదవి ఉన్నతమెలాగవుతుంది? నాగభూపతి ప్రవర్తన చూశాక వినమ్రుడికి ఉన్నత పదవులంటే విరక్తి పుట్టింది.

"ప్రతాపుడిచ్చిన ద్రాక్షరసంలో విషముండ వచ్చుననీ వినమ్రుడికీ తెలుసు. కానీ ప్రతాపుడి స్నేహశీలతను పూర్తిగా నమ్మిన వినమ్రుడది తాగి ప్రాణం మీదకు తెచ్చుకున్నాడు. ప్రతాపుడు వాడి నమ్మకాన్ని ఋజువుచేశాడు. అటువంటి వాడికి స్నేహితుడిగా కాక బానిసగా ఉండడం లోనే సుఖముందని గ్రహించిన వినమ్రుడు ఒక బానిసగా యజమాని మాట శిరసావహించి సేనాధిపతి అయ్యాడు. సేనాధిపతి తనకు బానిసగా ఉండడంలో ప్రతాపుడికీ సుఖముంది కదా!"

అది సరియైన సమాధానం కావడంతో సవిత్సుకుడి కెదురుగా ఉన్న కన్యపై కరాళుడి ప్రభావం నశించి ఆ యువతి ఏనుగుగా మారి అడవిలోకి పరుగుతీసింది.

—ఎస్. శివనాగేశ్వరరావు



చిన్నారి చిట్టిలోకానికి మా బహుమతి

ఇక్కడ

...ండాలి

# నూరుకళ్ల పిశాచం చెప్పిన కథ





# శ్రీరాముని కంటె ఘనుడు

ఒకానొకప్పుడు కోసలదేశాన్ని రఘునందనుడనే రాజు పాలించేవాడు. ఆయన భార్య సీత. సమీపారణ్యంలోని క్రూరమృగాలు నగరవాసుల మీద దాడిచేసి బాధిస్తున్నాయని తెలిసి రఘునందనుడా ప్రమాదం నివారించడానికి వేటకు బయల్దేరాడు. మహారాణి సీత కూడా వేటకు వెళ్ళి అడవిని చూడాలని సరదాపడితే ఆయన కాదనలేకపోయాడు.

రఘునందనుడు ఒక వారంరోజుల పాటు అడవిలో ఉండి నగరవాసులకు క్రూరమృగాల బాధ లేకుండా చేశాడు. వేటలో బాగా అలసిపోయి ఆయన ఒకరోజు అక్కడే ఉండి విశ్రాంతి తీసుకోవాలని నిశ్చయించు కున్నాడు. అటువంటి సమయంలో మహాకాయుడైన రాక్షసుడొకడు మెరుపు దాడిచేసి సీతను ఎత్తుకుని ఆకాశ మార్గాన పారిపోయాడు. వాణ్ణి ఎదుర్కోవడం రాజుకు, సైనికులకు కూడా సాధ్యపడలేదు.

సైనికులతో సహా రాజ్యానికి తిరిగి వచ్చేక రఘునందనుడు తన సోదరుడైన లఘునందనుడికి రాజ్యభారం అప్పగించి తను అడవులకు బయల్దేరాడు. మంత్రులతణ్ణి వారించి, "మహారాణిని వెనక్కు తేవడం మా అందరి బాధ్యత. మనం సైన్యంతో వెళ్ళి రాక్షసుణ్ణి చంపి రాణిని తెచ్చుకుందాం" అన్నారు. రఘునందనుడు దీనికి అంగీకరించక, "ఆ రాక్షసుడు మాయావి, మహాశక్తిమంతుడు. వాడిని నేను, సైనికులు

వసుంధర

కలిసి ఏమీ చేయలేకపోయాం. ఇప్పుడు వాడెక్కడుంటాడో తెలియదు. వాణ్ణెలా ఎదిరించాలో తెలియదు. నా రాజ్యం, నా ప్రజలు ఇబ్బందులకు గురికావడం నాకిష్టముండదు. నేను అడవికి వెళ్ళి తపస్సు చేసి ఆ రాక్షసుడి నెదిరించే శక్తి సంపాదించి నా భార్యను వెనక్కు తెచ్చుకుంటాను. నన్నాపవద్దు" అన్నాడు.

లఘునందనుడు దీనికి అంగీకరించి, "అన్నా! అలనాటి భరతుడిలా నీ పాదుకలు మాత్రం సింహాసనం మీద ఉంచి రాజ్యం పాలిస్తాను. నీవు వదినగారిని వెనక్కుతెచ్చే శుభఘడియల కోసం ఎదురుచూస్తూంటాను. ఎన్నటికీ నీవే కోసలకు ప్రభువ్వు" అన్నాడు.

రఘునందనుడు రాజ్యం వదిలి అడవికి వెళ్ళి ఘోరతపస్సు చేశాడు. అలా రెండు సంవత్సరాలు గడిచేక పరమశివుడు ప్రత్యక్షమై, "సంకల్ప మాత్రాన కోరినచోటుకు వెళ్ళగల వరమూ, నిన్ను అజేయుణ్ణి చేసి సర్వదా నీకు విజయప్రాప్తి కలిగించగల ఖడ్గాన్నీ ఇస్తున్నాను. ఇకమీదట సుఖంగా జీవించు" అన్నాడు.

రఘునందనుడు శివుడిచ్చిన విజయఖడ్గాన్ని తీసుకుని తన భార్యను చేరాలని మనసులో అనుకున్నాడు.

ఆ సమయానికి సీత మహాగాయుడి అంతఃపురవనంలో ఒక అశోకవృక్షం క్రింద రాక్షస స్త్రీల మధ్య కూర్చుని భర్తకోసం విలపిస్తోంది. ఒక రాక్షస స్త్రీ ఆమెతో, "సౌందర్యవతులను అంగీకారం లేకుండా పెళ్ళాడకూడదని మహాకాయుడికి





నియమముండడం వల్ల నీవు రక్షించబడ్డావు. కానీ ఆయనలో సహనం సన్నగిల్లిందంటే అన్ని నియమాలూ మరచి నిన్ను పెళ్ళాడ్డమే కాక నానా హింసలకూ గురిచేయగలడు. మర్యాదగా వెంటనే పెళ్ళికి ఒప్పుకో" అని హితవు చెప్పింది.

సీత ఆ రాక్షస స్త్రీనంక కోపంగా చూసి, "మహాకాయుడిని నా జోలికి రాకుండా ఆపు తున్నది వాడి నియమం కాదు. నా పాతివ్రత్య ప్రభావం. పాపాత్ములకు పతివ్రతల శరీరం అగ్ని వంటిది" అంది.

సరిగ్గా అప్పుడే అక్కడకు ప్రవేశించిన మహా కాయుడు, "ఇన్నాళ్ళు నాకు బందీగా ఉన్నప్పటికీ నీ తలపొగరు తగ్గలేదు. నీ శరీరం నిప్పు వంటి దైతే నిప్పుతో ఆడుకోవడం నాకు సరదా. ఇప్పుడే నిన్ను రాక్షస వివాహం చేసుకుంటాను. నీ పాతి వ్రత్య ప్రభావంతో నన్నాపగలిగితే ఆపు" అంటూ ఆమెను సమీపించసాగాడు.

అదేసమయానికి శివుడి వరప్రభావంతో అక్క

## జూన్ నెల
## బొమ్మల సంభాషణ
## ఫలితాలు - 1



కుర్రవాడు: పేపరు కొస్త అలాగే పట్టుకోండి, "మన్నన - మర్యాద" సినిమా ఏ హాల్లో ఆడుతోందో అక్కడికి బస్‌లో త్వరగా వెళ్ళాలి!

పెద్దమనిషి: మనిషన్న వాడికి స్వతహాగా ఆ గుణాలుండాలిగాని, సిని మాలు చూసినంత మాత్రాన అల వడవు బాబూ!

—వి.కె. విశ్వనాథ్, వరంగల్

డకు వచ్చిన రఘునందనుడు కత్తి దూసి, "రాక్షసాధమా! నీకు చావు మూడింది. ముందు నన్నెదిరించి ఆ తర్వాత నీ ప్రతాపం అబలలపై చూపుదువుగాని" అన్నాడు.

రాక్షసుడు రఘునందనుణ్ణి చూసి, "ఎవరు నువ్వు? ఇక్కడికెలా రాగలిగావు?" అన్నాడు. రఘునందనుడు తన వివరాలు చెప్పగానే, "ఓహో, సీతకు భర్తవా? అలనాడు అడవిలో నా చేతిలో ఓడిపోయావు. నీ కళ్ళముందే నీ

భార్య నెత్తుకుపోతూంటే ఏమీ చేయలేకపోయావు. ఏ ధైర్యంతో నువ్విప్పుడిక్కడికి వచ్చావు" అంటూ మహాకాయుడు వికటంగా నవ్వాడు.

"నా సంగతలాగుంచు. మహా పతివ్రత అయిన నా భార్యను నువ్వేమీ చేయలేవని నాకప్పుడే తెలుసు. అయితే నువ్వు నా రాజ్యానికి వచ్చి నా భార్యను అపహరించావు. అక్కడే చంపితే నేను స్థానబలంతో నీకన్యాయం చేశానని లోకాపవాదు నామీద పడవచ్చు. నీవంటి దుర్మార్గుణ్ణి ని స్థావరంలోనే చంపి ప్రపంచంలోని పరమ దుర్మార్గులందరికీ హెచ్చరికగా ఉండాలని ఇక్కడికి వచ్చాను. నీ స్థావరం తెలుసుకుందుకు కొంత ఆలస్యమయింది.. తెలుసుకున్నాక నిన్ను చంపడానికింక ఆలస్యం చేయను" అంటూ రఘునందనుడు కత్తి ఝుళిపిస్తూ మహాకాయుడి మీదకు దూకాడు.

అప్పుడు మహాకాయుడు పెద్దగా నవ్వుతూ గాలిలోకి ఎగిరాడు. అక్కణ్ణించి రాళ్ళ వర్షం



కురిపించి రఘునందనుణ్ణి హతమార్చాలని వాడి పన్నాగం. కానీ రఘునందనుడు మనసులో పరమశివుణ్ణి స్మరించుకుని కత్తిని గాలిలోకి వదిలాడు. ఆ ఖడ్గం రాక్షసుడు కురిపించే రాళ్ళవర్షాన్నాపడమే కాక మెరుపువేగంతో వెళ్ళి వాణ్ణి హతమార్చి తిరిగి రఘునందనుడి ఒరలో వాలింది.

ఈ దృశ్యం చూసిన రాక్షస స్త్రీలు భయంతో నిశ్చేష్టులైపోయారు. ఈలోగా చుట్టుపక్కల ఉన్న

జూన్ నెల

బొమ్మల సంభాషణ

ఫలితాలు - 2.



పెద్దమనిషి: పెద్దలనే మర్యాద లేకుండా, అలా మీద పడకపోతే ఓ పేపరు కొనుక్కోరాదూ?

చిన్నవాడు: మీరు చదువుతున్న పేపరు కొన్నది నేనేనండీ! హెడ్డింగ్స్ చూసిస్తానని తమరు తీసుకుని గంట సేపయింది!

పెద్దమనిషి: అయితే ఇవ్వు వెళ్ళిన జన్మలో నీవెళ్ళలేదన్నమాట!!

—జగదీష్, వరంగల్.



కావలా భటులు వచ్చి చెప్పగా విషయం తెలుసుకుని అక్కడకు వచ్చిన మహాకాయుడి తమ్ముడు అతికాయుడనేవాడు రఘునందనుడికి నమస్కరించి, "మహానుభావా! నా అన్నను చంపిన నీవు సామాన్యుడివికాదు. నేను, రాక్షస ప్రజలు కూడా మహాకాయుడి దుర్మార్గాలకు బాధపడుతున్నాం. కానీ అతడి బలానికి తలవంచి బానిసల్లా బ్రతుకుతున్నాం. మహాకాయుడి మీద కోపాన్ని నీవు మామీద చూపించక కరుణతో విడిచిపెడితే నేను నీ ప్రతినిధినై ఈ రాక్షస రాజ్యాన్ని నీ ఆదర్శాల ప్రకారం పరిపాలించగలను" అన్నాడు.

రఘునందనుడు సరేనని అతికాయుణ్ణి



రాక్షస రాజుగా పట్టాభిషిక్తుణ్ణి చేశాడు. అతికాయుడు రఘునందనుణ్ణీ, సీతను ఘనంగా సన్మానించి ఆ దంపతులకు ఆకాశయానం చేయగల విమానాన్ని కానుకగా ఇచ్చాడు. సంకల్పమాత్రాన తాను మాత్రమే ఎక్కడికైనా వెళ్ళగలడు తప్ప రాణిని కూడా తీసుకుని వెళ్ళలేడు కాబట్టి రఘునందనుడీ కానుకకు ఎంతగానో సంతోషించి అతికాయుడి వద్ద వీడ్కోలు తీసుకొని విమానంలో భార్యాసమేతుడై బయల్దేరి కోసలరాజ్యం చేరుకున్నాడు. లఘునందనుడు జరిగిందానికి ఎంతో సంతోషించి అన్నగారికి రాజ్యాన్ని తిరిగి అప్పగించాడు.

ఇలా ఉండగా కొన్నాళ్ళకు ఛారులద్వారా రఘు నందనుడికో విశేషం తెలిసింది. రామాయణ కాలంలో శ్రీరాముడు పరపురుషుడి చెంతనున్న తన భార్యను అగ్నిపరీక్ష తర్వాతనే స్వీకరించాడు. రఘునందనుడి భార్య అగ్నిపరీక్షద్వారా తన పవిత్రతను నిరూపించుకోవాలని ప్రజలందరూ భావిస్తున్నారు.

ఇది తెలియగానే రఘునందనుడు తన మంత్రులను, సోదరుణ్ణి పిలిచి విషయం చెప్పి,



"రామాయణకాలంనాటి పరిస్థితులెలాంటివో తెలియవు. కానీ ఇప్పుడు మహారాణిని అగ్ని పరీక్షకు గురిచేయడం ఆమెకూ, నాకూ అవ మానమే! మహారాణి పరపురుషుడి ఇంట నాలు గేళ్ళున్నమాట నిజం. కానీ ఆ తప్పు ఆమెది కాదు. పరపురుషుడు నన్నోడించి ఆమెను తీసు కుని వెళ్ళాడు. ఆ తర్వాత వాణ్ణి ఓడించి నేనామెను వెనక్కు తెచ్చుకునేందుకు నాలుగేళ్ళు పడితే అది నా తప్పు. నేనామె పవిత్రతను

జూన్ నెల

బొమ్మల సంభాషణ

ఫలితాలు - 3



పేపరు పట్టుకున్నాయన: మరీ అంతగా పేపర్లోకి తొంగి చూడనక్క ర్లేదు! ఎందుకంటే ఇది నిన్నటి పేపరు!!

కుర్రవాడు: చాలా థ్యాంక్స్ సార్! నిన్నటి పేపరుకోసం తెగ తిరుగుతు న్నానండీ! ఈరోజు పేపర్లోని రిజల్టులో నా నెంబరు లేదు! నిన్నటి పేపర్లో వచ్చేనుంటుందని వెతుకుతున్నాను!!

— నివాస్, కొత్తగూడెం

నమ్ముతున్నాను. ఆ పవిత్రతను పరీక్షకు గురి చేయడమే తప్పని ఈ కాలాన్నిబట్టి నేను శాసిస్తున్నాను. ఈ శాసనంపట్ల మీకేమైనా అభ్యంతరముంటే చెప్పండి" అన్నాడు.

దీనికి లఘునందనుడు, మంత్రులు కూడా బదులు చెప్పలేదు. దాంతో, "భార్యాభర్తలిద్దరూ ఒకరినొకరు నమ్ముకున్నప్పుడు సమాజం వారి పవిత్రత గురించి చర్చించడం నేరం" అన్న శాసనం అమల్లోకి వచ్చింది. ఈ శాసనం ప్రజల్లో





## బొమ్మల సంభాషణ

ఈ బొమ్మలోనివాళ్ళు ఏం మాట్లాడుకుంటే నవ్వు వస్తుందో, ఆ సంభాషణ వ్రాసి, ఈ సంచిక విడుదలైన పది రోజులలోగా మాకు పంపకోరుతున్నాం. బాగున్న అయిదింటిని ఎన్నుకొని, ఒక దానికి రూ. 15/- పంపుతాం. సంభాషణలు కార్డుమీద మాత్రమే వ్రాసి పంపాలన్నది షరతు.

బొమ్మల సంభాషణ
80, ధనలక్ష్మి కాలని, మద్రాసు - 26.

కలకలం పుట్టించింది. రఘునందనుడు స్త్రీ లోలుడై అపవిత్రురాలైన తన భార్యను ఇంట్లో ఉంచుకున్నాడనీ, మహారాణిని అడవిలో విడిచి పెడితేనే ఆయన ఆదర్శ ప్రభువౌతాడనీ ప్రజలు చెప్పుకోసాగారు.

ఈ వార్త కూడా రఘునందనుడికి చారుల ద్వారా చేరింది. ఇది వింటూనే ఆయన మళ్ళీ మంత్రులనీ, తమ్ముణ్ణీ పిలిచి, "నా ప్రజలకు నేను లేకపోతే సమర్థుడైన మరొక రాజు వస్తాడు.

జూన్ నెల

బొమ్మల సంభాషణ

ఫలితాలు - 4



తండ్రి : ఏరా! వెధవా! ఇలా విరగబడి సినిమా 'కాలం' చదివినట్టు, స్కూల్లో చదివివుంటే, ఈ పేపర్లో నీ నెంబరైనా వచ్చేది కదురా!

కొడుకు : వావ్! నా అభిమాన హీరో గురించి ఏం గొప్పగా వ్రాశారు! పూర్తిగా చదవనీ! కొస్త పేపరు పైకెత్తి పట్టుకో! నడుం నొప్పేస్తుంది!!

—వి. సుమలత, వరంగల్

కానీ నా భార్య నన్నే నమ్ముకుని నాతో జీవితం గడపాలని వచ్చింది. అమాయకురాలైన నా భార్య లేనిదే నాకు జీవితం లేదు. ఆమెలేని రాజరికం నాకు అవసరంలేదు. నేను తప్పు చేశానని ప్రజలనుకుంటున్నారు కాబట్టి నేను, నా భార్య రాజ్యం వదలి అడవులకు వెళ్ళి జీవిద్దామనుకుంటున్నాం. మీ అభిప్రాయం చెప్పండి" అన్నాడు.

ఇటు ప్రజాభిప్రాయాన్ని కాదనలేక అటు సమర్థుడైన ప్రభువును వదులుకోలేక మంత్రులు సందిగ్ధంలో పడ్డారు. లఘునందనుడు మాత్రం, "చారులు నలుగురి మాటవిని మనకు చేరవేస్తే అది ప్రజాభిప్రాయమైపోదు. ఒకనాడు శ్రీరామ చంద్రుడు చేసిన త్యాగం ఈనాడు స్త్రీలపాలిట శాపమైంది. కాలానుగుణంగా శాసనాలు, నియమాలు, సంప్రదాయాలు మారాలి. తన్ను నమ్ముకున్న తన భార్యకోసం పదవినే వదలాల నుకుంటున్న నా అన్న రఘునందనుడు మన



సంప్రదాయంలో కొత్త పద్ధతి ప్రవేశపెట్టాడు. ఇందుకు ప్రజలేమంటారో తెలునుకుందుకు చారులెందుకు? ఇప్పుడున్న పరిస్థితుల్లో నా అన్ననెందరు రాజు కావాలనుకుంటున్నారో ఎన్నికల ద్వారా తెలునుకుందాం" అన్నాడు.

ఆ విధంగా ఎన్నికలు జరిగాయి. ప్రజల అభిప్రాయం రహస్యంగా సేకరించబడింది. ఎన్నికల ఫలితాలు తెలిసేసరికి రఘునంధనుడా శ్చర్యపోయాడు. రాజ్యంలో లక్షలాది ప్రజలు తనే రాజు కావాలనుకుంటున్నారు. వద్దన్నవారు రాజ్యం మొత్తంమీద వెయ్యిమంది కూడా లేరు.

"అలనాడు శ్రీరామచంద్రుడు కూడా ఈవిధంగా ప్రజాభిప్రాయం సేకరించి ఉంటే కొందరు మూర్ఖుల అభిప్రాయానికి విలువనిచ్చి లక్షలాది ప్రజలను బాధపెట్టే పొరపాటు చేసి ఉండేవాడు కాదు" అని లఘునందనుడు అన్నతో అన్నాడు. ఆ విధంగా రఘునందనుడి రాజ్యంలో ప్రారంభించబడిన ఎన్నికల తంతు



ఏదో ఒకరోజున ప్రపంచాన్నంతా ఆక్రమించగల దని అంతా అనుకున్నారు.

వినయశీలుడు కథ పూర్తిచేయగానే రాణీ, "రఘునందనుడు శ్రీరాముడికంటె గొప్పవాడు. ప్రజాభిప్రాయాన్ని గౌరవించేందుకు వారి అభిప్రాయాన్ని తెలుసుకుందుకు చారులు కాక ఎన్నికలు సరైనవని తెలుసున్నాడు. కానీ నేను రఘునందనుడిలా నా రాజ్యంలో ఎన్నికలు నిర్వ హించగలనా? రఘునందనుడు నిస్వార్థపరుడు,

జూన్ నెల

బొమ్మల సంభాషణ

ఫలితాలు - 5



పేపర్లోకి చూస్తున్న వ్యక్తి: ఈ పేజీలో వరుడు కావలెను అనే కాలమ్ ఉండాలి! లేదేమిటి సార్?

పేపర్ పట్టుకున్న వ్యక్తి: నేను కూడా ఇందాకా అదేనయ్యా వెతుకుతున్నాను...! మధ్యన ఏమిటి నీ గోల...

— జె. ఉమామహేశ్వరరావు, పాలకొల్లు

నిష్కళంకుడు, కడు సమర్థుడు. నేనెలాగూ ఆయనకులా సమర్థతను సంపాదించుకోలేను. ఇంతవరకూ జరిగింది మరిచి ఇకమీదనైనా నిస్స్వార్థంగా, నిష్కళంకంగా ఉండాలి" అనుకుంటూ లేచి వెళ్ళి మర్నాడు తిరిగి వచ్చింది. అప్పుడు యథాస్థలంలో యథాసమయానికి వినయశీలుడి నావహించుకున్న నూరుకట్ల పిశాచం రాణికి యథాప్రకారం మరో కథను చెప్ప సాగింది.

(వచ్చే సంచికలో ఆ కథ)





# ఇల్లాలి సేవ

శంకరప్ప నాగమణి అంటే ఇష్టపడ్డాడు. శంకరప్ప తల్లి వీరమ్మ కట్నం లేందే పెళ్ళి జరగడానికి వీల్లేదంది.

నాగమణికి డబ్బులేదు. అందుకని పెళ్ళి వాయిదా పడింది.

ఈలోగా వీరమ్మకు జబ్బు చేసింది. వైద్యుడు వచ్చి వీరమ్మను పరీక్షించి, ఒక సంవత్సరంపాటు ఏపనీ చేయకుండా విశ్రాంతి తీసుకోమని చెప్పాడు.

ఆ ఊళ్ళో పనిమనుషులు దొరకరు. మనిషి సాయం తప్పనిసరి కావడంతో శంకరప్ప నాగమణిని బ్రతిమాలాడు.

"మీ అమ్మ జబ్బు మనిషి. ఆమెకు నేను ఊరికే సాయం చేయను. నేను చేసే సేవలకు డబ్బివ్వాలి" అని కచ్చితంగా చెప్పేసింది నాగమణి. చేసేదిలేక సరేనన్నాడు శంకరప్ప.

నాగమణి ఆ ఇంట్లో అడుగు పెడుతూనే, "ముందే చెబుతున్నాను. ఇల్లు ఊడ్వడానికి, మంచినీళ్ళు తోడడానికి, వంట చేయడానికి వేర్వేరుగా ఇచ్చుకోవాలి. మీ శక్తినిబట్టి మీకు అవసరమైన పనులు నాచేత చేయించుకోండి" అన్నది.

మొదటి నెల వీరమ్మ నాగమణి చేత అన్ని పనులూ చేయించుకుంది. నాగమణి కుదురుగా అన్ని పనులూ చేయడం ఆమెకెంతో నచ్చింది. నెల పూర్తయ్యేసరికి నాగమణి తనకు వెయ్యి వరహాలిచ్చుకోవాలని చెప్పింది.

"నా కొడుకు జీతమే అంతలేదు. నీకెక్కణ్ణించి తెచ్చిస్తానే వెయ్యి వరహాలు?" అంటూ వీరమ్మ గుండెలు బాదుకుంది.

"అంత డబ్బివ్వడానికి శక్తిలేకపోతే కొన్ని పనులే చేయించుకోండి" అంది నాగమణి.

"అలాగంటే సరిపోతుందా? ఇంటిపనీ వంటపనీ చేయడానికి వెయ్యివరహాలా? దేనికైనా న్యాయముండాలి" అంది వీరమ్మ.

"న్యాయం లేదనిపిస్తే వెళ్ళి న్యాయాధికారినే అడగండి" అంది నాగమణి నిరసనగా.

వీరమ్మ ఊరుకోకుండా న్యాయాధికారి వద్దకు వెళ్ళింది. న్యాయాధికారి నాగమణి మాటలు సబబుగానే ఉన్నాయన్నాడు.

వీరమ్మ నిరుత్సాహంగా ఇంటికి వెళ్ళి "నేను చస్తే చచ్చానుగానీ ఇంటి పనులన్నీ నేనే చేసుకుంటాను. ఒక్కనెలకు వెయ్యి వరహాలెక్కడిచ్చుకుంటాం?" అంది కొడుకుతో.

"అమ్మా! నీకంటే నాకు డబ్బెక్కువకాదు. నువ్వేమీ బెంగపడకు. ఎలాగో నేను సంపాదించి తెస్తాను. నువ్వు మాత్రం నాగమణిచేత సేవలు చేయించుకో" అన్నాడు శంకరప్ప.

"అయితే దానిచేత కొన్నిపనులే చేయిద్దాం" అంది వీరమ్మ.

శంకరప్ప సరేనన్నాడు.

ఆ రోజునుంచీ నాగమణి ఇల్లూడ్చి, గిన్నెలు తోమే పనిమాత్రం చేయసాగింది. నీళ్ళు తోడడం, వంటలో తల్లికి సాయపడడం శంకరప్ప చేస్తున్నాడు. అయితే మధ్యలో దేనికో దానికి నాగమణి అవసరం పడుతూండేది. పని చేసినప్పుడల్లా నాగమణి ఓ పుస్తకంలో పద్దు రాసేది ఆ విధంగా రెండోమాసం మూడువందల వరహాలు ఇవ్వాల్సిందిగా తేల్చిందామె.

"ఇలాగైతే మనం అడుక్కుతినాలి. ఏ ఇరుగు పొరుగుల్నో సాయం అడుగుతాను" అంటూ వీరమ్మ పక్కింటి వాళ్ళకు తన గోడు చెప్పుకుంది.

"మామూలుగా అడిగితే సాయం చేసేవాళ్ళమేమో! ఇప్పుడు మా సాయానికి విలువ తెలిసింది. ఊరికే అంతంత సాయాలు చేయలేం" అంది పక్కింటావిడ.



అప్పుడు మరో ఇరుగింటావిడ, "నీ కొడుక్కి పెళ్ళి చేసేయకూడదుటమ్మా! అప్పుడు నీకీ అవస్థ తప్పుతుంది" అంది.

వీరమ్మకీ ఉపాయం నచ్చింది. ఆమె వెంటనే కొడుకుతో, "నీకు నచ్చిన పిల్లని పెళ్ళిచేసుకో" అని చెప్పింది.

శంకరప్ప వెంటనే నాగమణిని అడిగాడు. ఆమె తల అడ్డంగా ఊపి, "నిన్ను పెళ్ళిచేసుకుంటే నా ఆదాయం ఆగిపోతుంది. నా సేవలకు విలువుండదు. అందుకే ముందుగా పదివేల వరహాలివ్వు. ఆ తర్వాతే మనపెళ్ళి!" అన్నది ఖచ్చితంగా.

శంకరప్ప తల్లికి విషయం చెప్పాడు. వీరమ్మ నాగమణిని నిలదీసి, "ఇదెక్కడి విడ్డూరమే! పెళ్ళికి నువ్వు కట్నమివ్వాల్సింది పోయి ఎదురు డబ్బడుగుతావా?" అంది.

"పెళ్ళయితే నేను నీకు, నీ కొడుక్కి ఊరికే సేవలు చేయాలి. సేవల విలువెంతో న్యాయాధికారే తేల్చి చెప్పాడు కదా! అందువల్ల ముందుగా పదివేల వరహాలిచ్చుకున్నాకూడా ఇంకా మీకే లాభం! పెళ్ళి చేసుకోకపోతే ఇదే సేవలకు అంతడబ్బు నేను రెండు మూడేళ్ళలో సంపాదించగలను. పెళ్ళయితే జీవితాంతం ఊరికే సేవలు చేసుకోవాలికదా!" అంది నాగమణి.

వీరమ్మకు జ్ఞానోదయమైంది. ఆమె నాగమణితో, "అమ్మాయీ! నువ్వు నా కళ్ళు తెరిపించావు. ఇల్లాలి సేవలకు ఎవరు విలువ కట్టగలరు? అలాంటి సేవలు చేసే ఇల్లాలినింకా వేరే కట్నమడిగి మహాపాపం చేశాను. నాకు బుద్ధి వచ్చింది. నువ్వు మావాణ్ణి పెళ్ళి చేసుకో" అంది.

శంకరప్పకూ, నాగమణికీ పెళ్ళి జరిగింది. ఆ తర్వాత నాగమణి తన సేవలతో అత్తగారిని ఎంతగానో మెప్పించింది.

ఆ సేవల విలువ ముందే తెలిసిన మూలాన వీరమ్మ కోడలి నెప్పుడూ పల్లెత్తు మాటనకుండా అపురూపంగా చూసుకునేది.



# తాదూర కంతలేదు, మెడకో డోలు

(సామెత కథలు)

చంద్రానికి చదువు రాలేదు. వాడికి చెడు అలవాట్లన్నీ అబ్బాయి. అన్నింటికీ మించి వాడు పరమ బద్ధకస్తుడు. వాడీడువాళ్ళందరూ పెళ్ళి చేసుకుని బిడ్డల్ని కని సంసారాలు చేసుకుంటూంటే వాడు మాత్రం తలిదండ్రులకు భారంగా ఉంటున్నాడు.

ఒకరోజున చంద్రం మేనమామ వాళ్ళింటికి వచ్చి తన కూతురికి పెళ్ళి కుదిరిందనీ కట్నమివ్వడానికి ధనసాయం కావాలనీ చంద్రం తండ్రిని అడిగాడు. పక్కగదిలో ఉన్న చంద్రం ఇది విని, "నీ కూతుర్ని నేనే పెళ్ళిచేసుకుంటాను. నీకు కట్నంబాధ ఉండదు" అన్నాడు మేనమామతో.

"తాదూర కంతలేదు, మెడకో డోలా? ఉద్యో:ం సద్యోగం లేని నీకు పిల్లనెవరిస్తార్రా?" అన్నాడు మేనమామ.

మనిషి పట్టనంత చిన్న కన్నంలోంచి తప్పించుకోవాలనుకుంటూ మెడకు డోలు తగిలించుకోవడం ఎలాంటిదో తన అవసరానికే తండ్రిపై ఆధాపడ్డవాడు పెళ్ళి చేసుకోవాలనుకోవడం అలాంటిదేనని గ్రహించిన చంద్రం సిగ్గుపడి చెడు అలవాట్లు వదిలిపెట్టి కష్టపడి పనిచేయడం మొదలుపెట్టాడు.

జ్యోతిర్మయి



# జ్ఞాన స్వరూపం

ఒకరాజుకు లేకలేక కొడుకు కలిగాడు. ఆయన వాణ్ణి అల్లారు ముద్దుగా చూసుకుంటున్నాడు. చూస్తూండగా వాడికి నాలుగేళ్ళ ప్రాయం వచ్చింది. అప్పుడు రాజు మంత్రిని పిలిచి, "ఎంతో బాగా చదువుకుని మహాజ్ఞాని అయిన వాడు, ఇంతవరకూ ఎవరికీ చదువు చెప్పనివాడు అయిన మంచి గురువును వెతికి తీసుకురా. యువరాజు విద్యాభ్యాసం ప్రారంభిస్తాడు" అన్నాడు.

అలాంటివాడికోసం అన్వేషణ ప్రారంభించాడు మంత్రి. జ్ఞాని అయిన ప్రతివాడికీ ఎందరో కొందరు శిష్యులుంటున్నారు. శిష్యులు లేనివారికి జ్ఞానం లేదు. అందువల్ల మంత్రి చాలా ఇబ్బంది పడ్డాడు. అయితే ఆయన అదృష్టంకొద్దీ కాశీ నగరంలో విద్యాధరుడనే జ్ఞాని గురించి తెలియ వచ్చింది.

విద్యాధరుడి కిటీవలే చదువు పూర్తయింది. గురువతణ్ణి శిష్యులందరిలోకీ ఉత్తముడిగా నిర్ణ యించాడు.

అప్పుడు మంత్రి విద్యాధరుణ్ణి కలుసుకుని తన కోరిక చెప్పాడు. విద్యాధరుడందుకు తండ్రి అనుమతిని కోరాడు. రాజు పిలిచినపుడు కాదంటే ప్రమాదమని విద్యాధరుడి తండ్రి అందుకు అనుమతించాడు. విద్యాధరుడు రాజాంతఃపురంలో మకాం పెట్టి యువరాజుకు విద్య నేర్పసాగాడు.

ఇలా కొంతకాలం గడిచేక రాజు విద్యాధరుణ్ణి కలుసుకుని యువరాజు విద్యాభ్యాసం గురించి అడిగారు.

విద్యాధరుడు వినయంగా, "ప్రభూ! యువ రాజు తెలివైనవాడు. కానీ ఒక్కడికీ చదువు విసుగ్గా ఉంటోంది" అని చెప్పాడు.

రాజు దీనికి అంగీకరించక, "ఒక్కడివీ ఉండ డానికి నీకిక్కడ ఉత్సాహంగా లేదు. అందుకే ఇలాగంటున్నావు. అవునా?" అన్నాడు.

విద్యాధరుడు తల అడ్డంగా ఊపి, "తమరు యువరాజు విడిగా ఎందుకు చదవాలంటున్నారో

శింగిసెట్టి సంజీవరావు

కారణం చెప్పండి!" అన్నాడు.

అప్పుడు రాజు విద్యాధరుణ్ణి ఓ చీకటి గదిలోనికి తీసుకునివెళ్ళి, "ఈ గదిలో ఓ దీపముండేది. చమురంతా అయిపోవడంతో అది ఆరిపోయింది. చదువు వెలుగు వంటిది. గురువు చమురు వంటివాడు. ఆ చమురు ఎందరికోసమో వ్యయంచేస్తే ఒక్కడికీ చదువు తిన్నగా రాదు" అన్నాడు.

విద్యాధరుడు నవ్వి, "అందుకేనా మీ అభ్యంతరం? అయితే వినండి. చదువు వెలుగు వంటిదే! అది మనిషిలోని అజ్ఞానాంధకారాన్ని పారద్రోలుతుంది. అయితే గురువు చమురు దీపం కాదు. సూర్యుడి వంటివాడు. జ్ఞాని అయిన గురువు సూర్యుడిలా ఎన్నోకోట్ల సంవత్సరాల పాటు కోటానుకోట్ల శిష్యులకు జ్ఞానాన్ని పంచిపెట్ట గలడు. గురువు చదువును పంచి పెట్టడానికి పరిమితి జ్ఞానంకాదు, ఆయువు" అన్నాడు.

రాజు అంతటితో తృప్తిచెందక విద్యాధరుడినో జలాశయంవద్దకు తీసుకుని వెళ్ళి, "చూశావా, ఇందులోని నీరు వాడకం వల్ల తగ్గిపోయింది. జ్ఞానం నీటివంటిదే కదా!" అన్నాడు.

విద్యాధరుడు తిరిగి మందహాసం చేసి, "ప్రభూ! జ్ఞానం నీటి వంటిదే కానీ అది జలాశయంలోని నీరు కాదు. మహా సముద్రంలోని నీరు ఎండకు ఆవిరై మేఘాలుగా మారి వర్షించి ఈ జలాశయాలను నింపుతోంది. ఎన్ని జలాశయాలను నింపినా సముద్రపు నీటికి తరుగులేదు. తమరు మిడిమిడి జ్ఞానంతో మహాసముద్రమంతటి జ్ఞానాన్ని జలాశయంతోటి, భాస్కరునివంటి గురువును చమురు దీపంతోటీ పోల్చుకోవడం వల్ల ఈ ఇబ్బంది. నా మాట విని యువరాజును గురుకులానికి పంపించండి" అన్నాడు.

రాజుకు జ్ఞానోదయమయింది. ఆయన విద్యాధరుడికి విలువైన కానుకలిచ్చి పంపించాడు. తర్వాత యువరాజు గురుకులానికి వెళ్ళి విద్యాభ్యాసం చేసి అచిరకాలంలోనే అన్ని విద్యలలోనూ ఆరితేరి తండ్రికి సంతోషం కలిగించాడు.





# పాపాత్ముడి పుణ్యం

ైశాలీ నగరంలో విశాఖుడనే ధనవంతుడు రమ లోభి, స్వార్థపరుడు, వాడికి జబ్బుచేసి నిపోతే దేవదూతలు వచ్చి స్వర్గానికి తీసుకుని ెళ్ళారు. అందమైన పూలతోటలు, అలంకరించ డిన భవనాలు, ఆరోగ్యవంతులైన మనుములు, డే అప్సరసలు, పాడే గంధర్వులతో నిండి న్న స్వర్గం విశాఖుడికెంతగానో నచ్చి బ్రతుకు ంటె చావే సుఖమనిపించింది. కానీ వాడి ంతోషమెంతో కాలం నిలబడలేదు.

విశాఖుడు పాపాత్ముడనీ దేవదూతలు పొర ాటున వాణ్ణి స్వర్గానికి తెచ్చారనీ గ్రహించిన ేవేంద్రుడు దేవదూతల్ని మందలించి విశాఖుణ్ణి రకానికి పంపించివేశాడు.

నరకంలో పాపులందరూ శిక్షలనుభవిస్తున్నారు. ందరు సలసల మరిగే నూనెలో వేగుతున్నారు. ందరు ఎర్రగా కాలిన ఇనుప స్థంభాలకు కట్టి ేయబడ్డారు. కొందరు తలక్రిందులుగా నిలబడి డ్డి తింటున్నారు. వాళ్ళు తినడం ఆపినప్పుడల్లా యమదూతలు కొరడాలతో కొడుతున్నారు.

ఈ శిక్షలు చూచి విశాఖుడు హడిలిపోయాడు. తనకెలాంటి శిక్ష పడుతుందోనని వాడను కుంటూండగా యమధర్మరాజు వాణ్ణి పిలిచి, "వైశాలీ నగరంలో విశ్వేశ్వరుడనే ధర్మాత్ముడున్నాడు. ఆయనకు ఆయువు తీరిపోగా దేవదూతలు స్వర్గా నికి తీసుకెళ్ళవలసి ఉంది. పొరపాటున వారు నిన్ను స్వర్గానికి తీసుకుని వెళ్ళారు. నీకింకా అయి దేళ్ళ ఆయుష్షుంది. నిన్ను తిరిగి భూలోకానికి పంపేస్తున్నాను" అన్నాడు.

ఆ విధంగా చనిపోయాడనుకున్న విశాఖుడు పునర్జీవితుడయ్యాడు. అయితే చచ్చి బ్రతికిన విశాఖుడికి తాను చూసిన విశేషాలు గుర్తున్నాయి. ఇంతకాలం తానెన్నో పాపాలు చేసి ఉన్నాడు. ఇక మిగిలిన అయిదు సంవత్సరాలలనూ పుణ్యం కూడబెట్టుకుని నరకబాధ లేకుండా చేసుకుని స్వర్గ సుఖాలు పొందాలనుకున్నాడు. కానీ పుణ్యమంటే ఏంచేయాలో తెలియక ఓ సాధువుని సలహా అడి

తిరుమలశ్రీ

గితే ఆయన పేదసాదలకు దానధర్మాలు చేయమని వాడికి చెప్పాడు.

అలాచేయడం మనసుకు కష్టంగానే ఉన్నా విశాఖుడు స్వర్గసుఖాలనాశించి అయిదేళ్ళలోనూ తనకున్నదంతా అందరికీ పంచిపెట్టి కాలధర్మం చెందాడు. అప్పుడు వాణ్ణి యమదూతలు వచ్చి నరకానికి తీసుకుని వెళ్ళారు.

విశాఖుడాశ్చర్యం చెంది, యమదూతలతో "నేనూ విశ్వేశ్వరుని వంటి ధర్మాత్ముడినే కదా! నా ఆస్తినంతా పేదవారికి దానం చేసి పుణ్యం సంపాదించుకున్నాను. స్వర్గానికి వెళ్ళ వలసిన నన్ను నరకానికెందుకు తెచ్చారు?" అని అడిగాడు.

యమదూతలు "ఆ విషయం యమధర్మ రాజునే అడిగి తెలుసుకో" అన్నారు.

విశాఖుడు యమధర్మరాజుతో, "ప్రభూ! ఈ అయిదు సంవత్సరాలకాలంలో నేను నాకున్నదంతా దానం చేశాను. ఆ పుణ్యం నన్ను స్వర్గానికి తీసుకుని వెళ్ళాలి. మీ దూతలు పొరపాటున నన్నిక్కడికి తెచ్చారు" అన్నాడు.

దీనికి యముడు పకపకా నవ్వి, "మూర్ఖుడా! డబ్బు కూడబెట్టడానికి నువ్వు చేసిన పాపాలు అయిదు సంవత్సరాలేమిటి, అయిదు జన్మలెత్తినా పోయేవికాదు. అదీకాక నువ్వు స్వర్గసుఖాల నాశించి స్వార్థబుద్ధితో దానాలు చేశావు. నిస్వార్థ బుద్ధితో చేసిన మంచిపని మాత్రమే మనిషికి పుణ్యాన్నిస్తుంది. ఇంకా నీకొక దేవరహస్యం చెబుతాను విను. నీవంటి పాపాత్ముడికి స్వర్గలోకం చూసే అర్హత లేదు. అయినా నువ్వు చూశావు. అందువల్ల నీవు భూలోకానికి తిరిగివెళ్ళగానే నీ ఆస్తిని పేదసాదలకు దానధర్మాలు చేయాలన మంచిబుద్ధి నీలో పుట్టింది. ఈ అయిదు సంవత్సరాలూ నువ్వు చేసిన పుణ్యానికి ప్రతిఫలం, నీవొకసారి స్వర్గాన్ని చూడగల అర్హత పొందావు. కానీ అంతకు ముందే నీవు స్వర్గాన్ని చూశావు కదా!! అందువల్ల నీకు నరకయాతన మాత్రమే మిగిలింది. అనుభవించు" అన్నాడు.






16

[జరిగిన కథ: సత్యానంద మహర్షికి కలలో కనిపించిన అనందుడు, అనంతుడు దుఃఖిస్తూ, ఆయనతో మనస్ఫూర్తిగా ప్రేమించి వివాహం చేసుకున్న నేనూ, అనంతుడూ గృహస్థాశ్రమ మాధుర్యాన్ని చవి చూడకుండానే దుష్ట జయంతుడు మమ్మల్ని కడతేర్చాడు. ఆ పాపాత్ముడిమీద పగ తీర్చుకోవాలన్న పట్టుదల మాలో నానాటికీ పెరిగి, మిమ్మల్ని వెంబడిస్తూ వస్తున్నాం. మాకు మళ్ళీ జన్మలు ప్రసాదించమంటారు. సత్యానంద మహర్షి వారి కోరికను త్వరలోనే తీరుస్తానంటాడు. పుత్రుడు, కిమ్యాడూ ఆయనకు ప్రణమిల్లి తిరోధానులౌతారు. అక్కడ విద్యాధర లోకంలోనూ, కిన్నెర లోకంలోనూ దేవే విషయమై అలజడి చెలరేగి, ముఖ్య ప్రముఖులందరూ హుటాహుటిగా అమరావతికి వెళ్ళి, ఇంద్రునితో తమ అభియోగాన్ని చర్చకు పెడతారు. ఇంద్రుడు వారిని తిరస్కరించగా విద్యాధర కిన్నెరలోక వాసులకూ, ఇంద్రునికీ మధ్య చర్చలు ముదిరి దేవగురువు బృహస్పతి కలగజేసుకుని, 'న్యాయ నిర్ణయానికి ధర్మాధర్మాలను దృష్టిలో పెట్టుకోవాలిగాని తారతమ్యాలను కాదు' అని దేవేంద్రుణ్ణి హెచ్చరిస్తాడు. ఇక చదవండి]

ఆ విధంగా ఇంద్రుణ్ణి హెచ్చరించిన తర్వాత బృహస్పతి జయసేనుణ్ణి చూస్తూ, "విద్యాధర యువసేనానీ! నీకు కూడా మేం చేసే విజ్ఞప్తి ఇదే! ఏకాంతంగా వున్నప్పుడు నవ్వడానికైనా, ఏడవటానికైనా హద్దులు లేవుగాని, పదిమందిలో వున్నప్పుడు సభ్యతాయుతమైన హద్దులున్నాయి. వాటిని అతిక్రమించడం ఎవరికీ శ్రేయస్కరం కాదు" అన్నాడు.

ఆ మాటలు వినగానే ఇంద్రుడు "గురుదేవా! ప్రభు ధిక్కారాన్ని, సభా మర్యాదాతిక్రమణను సహించి మాట్లాడుతున్నారా? వీళ్లకు ఎవరివల్లనో కలిగిన అవమానంకంటె, వీళ్లనుంచి మనకు కలిగిన అవమానమే ఎక్కువగా వున్నది. శిక్షించ వలసినచోట రక్షింపవలసిన మాట ఎందుకు సెలవిస్తున్నారో అర్థంకావటంలేదు" అన్నాడు.

బృహస్పతి "ఇంద్రా! మా ఆజ్ఞకు మన్నింపు లేనిచోటు మాకు కరకు కత్తులపోటు. దుఃఖితులు తమ బాధను భరించలేక తొందరపాటుతో ప్రవ ర్తించారని నువ్వు గురు తిరస్కారం చేస్తావా? ధర్మనిర్ణయంపట్ల సామరస్యం తగునుగాని, తామసం తగదు. వారికి జరిగిన అన్యాయ మేమిటో ప్రశాంతంగా విని, ఆ తర్వాత కర్తవ్యాన్ని

కిరణ్‌కుమారి



గురించి ఆలోచించు. అంతేగాని, ప్రారంభం లోనే, ప్రవేశంలోనే పగలను రగిలించుకోవటం వివేకవంతుల లక్షణం కాదు" అన్నాడు.

సభలో అందరూ కళ్లప్పగించి ఉత్కంఠతతో చూడసాగారు.

బృహస్పతి మాటలు విని ఇంద్రుడు కొన్ని క్షణాలు మౌనం వహించాడు.

ఆ తర్వాత అతడు మణిభూషణునివేపు తిరిగి "ఇంతకూ మీకు మా ప్రభుత్వంనుండి జరిగిన అన్యాయమేమిటో, ఎటువంటి న్యాయాన్ని రాబట్టుకోవాలని వచ్చారో చెప్పనేలేదు. వివరంగా చెప్పవచ్చు" అన్నాడు.

అప్పుడు మణిభూషణుడు సాభిప్రాయంగా తన మంత్రివేపు చూశాడు.

తమ ప్రభువు అభిప్రాయం గ్రహించిన మణి భద్రుడు వినయంతో ఇంద్రుణ్ణి చూస్తూ "మా ప్రభువుకు జరిగిన అన్యాయాన్ని వారివరంగా నేను నివేదిస్తాను. మహేంద్రులు అనుగ్రహించాలి" అన్నాడు.

తన తండ్రి అంతటి వినయాన్ని ప్రదర్శించు తూన్నందుకు జయసేనుడు కటకటలాడినట్లు అతణ్ణి చూస్తూన్న వాళ్లకు అర్థమైంది.

ఇంద్రుడు మణిభద్రుణ్ణి చూస్తూ "నివేదన ఎవరి వరంగానైనా సరే - నిరభ్యంతరంగా చేసు కోవచ్చు" అన్నాడు.

మణిభద్రుడు "అయితే వినండి. మా ప్రభు వుత్రిక చిరంజీవి సౌభాగ్యవతి దేవసేన సౌందర్య సౌశీల్యాది సద్గుణాలను తమరు వినేవుంటారు...." అని ఆపైన ఇంకా ఏదో చెప్పబోతూండగా ఇంద్రుడు మధ్యలోనే "సౌందర్య లావణ్యాదులను గురించే మేము విన్నాంగాని, సౌశీల్య సద్గుణాలను గురించి వినలేదు. తర్వాత చెప్పు" అన్నాడు.

వెంటనే జయసేనుడు ఇంద్రునివేపు తీవ్రంగా చూస్తూ "మీరు వినినా, వినకపోయినా, వెయ్యి కళ్లతో చూసినా చూడకపోయినా, మా యువరాణి పరమ పవిత్ర సౌశీల్య సద్గుణవతి అని ఈ దేవలోకాలన్నిటా పేరుగాంచింది. ఏ సామాన్య స్వర్గలోక సంచారిని అడిగినా ఈ విషయం తేటతెల్లమవుతుంది. తరువాత వినండి" అన్నాడు.

అతడి మాటలకు మనస్సు చివుక్కుమని నప్పటికీ, ఇంద్రుడు శాంతం వహించి వూరుకు న్నాడు.

ఇంద్రుని దెప్పిపొడుపుకు జయసేనుని సమాధానం చక్కగా సరిపోయిందని భావించిన బృహస్పతి కూడా మౌనంగా వుండిపోయాడు.

మణిభద్రుడు తన ప్రసంగాన్ని ఇలా కొన సాగించాడు.

"చిన్నప్పటినుంచి మా యువరాణిగారికి ఎందుకో దేవలోకాల ఆచార వ్యవహారాలు నచ్చేవి కాదు. అన్ని లోకాలకు సంబంధించిన నానా శాస్త్రాలను చదువుతూ, ప్రతి లోకంలో వుండే గుణ గౌరవాలను సాంగంగా సంగ్రహిస్తూ వుండేది.

అన్నిలోకాలకంటె మానవలోకపు మహనీయ సౌజన్యం వారి హృదయాన్ని బలంగా ఆకర్షించింది. అక్కడి స్త్రీల పతివ్రతా గుణం మా యువరాణిగారిని ఆకట్టుకున్నది.

అటువంటి సమయంలో - ఒకనాడు మీ కుమారుడైన జయంతులవారు ఒక దూతికను అసభ్య సందేశంతో మా యువరాణిగారి దగ్గరికి పంపించారు. సమయానికి అక్కడేవున్న మా కిన్నెర రాజపుత్రి మంజువాణి తన స్నేహితు రాలిని బాధించే ఆ నికృష్ట సందేశాన్ని అసహ్యించుకుని, ఆ దూతికను చీవాట్లు పెట్టి పంపించింది..." అని మణిభద్రుడు ఆ తర్వాత జరిగిన సంఘటనలన్నిటినీ - తాము ఆ సభాభవనం చేరేదాకా పూసగ్రుచ్చినట్లు వివరించాడు.

అతడు చెప్పిన అత్యంత విషాదపూరితమైన ఆ సుదీర్ఘ వృత్తాంతం వినగానే, సభలోని వారంతా విభ్రాంతులయ్యారు.

విద్యాధర వీరులు అంతటి ఆగ్రహావేశాలతో



ఎవ్వరినీ లెక్కపెట్టకుండా, ఇంద్రుని సన్నిధిలో తిరస్కారాన్ని ప్రదర్శించటానికి కారణం అప్పు డర్థమైంది వారందరికి.

సత్యశాంతి దయాధర్మ స్వరూపుడని దేవలో కాల్లో ప్రసిద్ధిగాంచిన విద్యాధర ప్రభువు తన పుత్రికి జరిగిన అన్యాయానికి, తన రాజరికానికి ఏర్పడిన అవమానానికి, ఎంతగా క్షోభపడనిదే ఇంద్రధిక్కారానికి తన అనుయాయులు పాల్పడ్డా నికి అనుమతించడని స్పష్టంగా అర్థంచేసుకున్నారు.

అంతమందిలో తన ప్రభుత్వాన్ని నిరసించటం, తన కొడుకుమీద దోషారోపణ చేయటం, విశే షించి విధేయతా విహీనంగా మాట్లాడటం, మొదలైనవన్నీ ఇంద్రుని క్రోధాన్ని పెంచాయి.

అతడు కల్లు త్రాగిన వెర్రి కోతిలా ఆ సభాభవనం

ప్రతిధ్వనించేట్లు "మణిభద్రా!" అని గద్దించాడు. అంతటితో ఆగక—

తీవ్రదృష్టులతో విద్యాధర మంత్రిని చూస్తూ "మాటిమాటికి, మాటమాటకు మా గౌరవాన్ని కలుషితంచేసే నీ వ్యాఖ్యానం పరిసమాప్తి అయినదా? ఇంకా ఏవైనా కల్పనలు, వూహలు చేర్చవలసివున్నవా?

అభియోగాన్ని సభలో ప్రవేశపెట్టే ముందు సాక్షులు అవసరంలేదనుకున్నావా?

'సాక్షాద్ద్రష్టా సాక్షి' అన్నట్లు కళ్లారా చూసిన వాడే సాక్షి. మా చిరంజీవిమీద నువ్వు మోపిన ఈ నేరాన్ని చూసిన వారెవరు?" అన్నాడు.

ఇంద్రుని మాటలు వినగానే మణిభద్రుడి మిత్రుడు గుణభూషణుడు విసురుగా ఇంద్రుని ముందుకువచ్చి, నిప్పులు కక్కే కళ్లతో అతణ్ణి చూస్తూ "హుం, కళ్లారా చూసినవారు చెప్పగా, చెవులారా విని, నోరారా ఈ విషాద ఘటనలను వివరించి, న్యాయాన్ని నిర్ణయించమని అడుగుతున్నాం. మీ పుత్రప్రేమలు, అధికారాలు, విచ్చవిడిగా ప్రపంచాలమీద చూపించటం చాలా అనుచితమైన దోషం అని ఇప్పటికైనా గ్రహించండి. దయచేసి, మీ పుత్రులు చేసిన దుష్టకార్యాన్ని అర్థంచేసుకుని, నిర్దోషులమీది శిక్షను వుపసంహరించండి. మా ప్రభుపుత్రికి, వారి నెచ్చెలులకు యథారూపాలు తెప్పించండి. లేకపోతే, దేవలోకాల్లో ఎటువంటి అలజడులు చెలరేగుతాయో, ఎవరికి ఏయే పరిస్థితి ఎదురవుతుందో చెప్పటం కష్టం" అన్నాడు.

అతడి మాటలకు ఇంద్రుడు పూర్తిగా శాంతాన్ని కోల్పోయాడు. వెయ్యికళ్లు కోపాగ్నులతో ఎర్రగా



మండసాగాయి!

అతడు గుణభూషణుణ్ణి చూస్తూ 'హూఁ' చెప్పడమే కష్టమా? అయితే, చేసిచూపిస్తాను చూడు మూర్ఖుడా! యుక్తాయుక్త పరిజ్ఞానం నశించి, నా సన్నిధిలో నోటికి వచ్చినట్లు ప్రేలుతున్నావు. స్వర్గాధిపతిని తృణీకరించే వాళ్లు స్వర్గలోకంలో వుండటానికి అనర్హులు భూలోకంలో కొండచిలువవై పడివుండు" అని శపించాడు.

సృష్టికర్తలు దేవేంద్రునికి అధికారాన్ని అప్పగించినప్పుడే, మిగిలిన దేవలోకపాలకుల కంటె ఎక్కువ శక్తులను ఇచ్చారు.

అతని ప్రభుత్వాన్ని తిరస్కరించినా, శక్తిని తిరస్కరించే శక్తిలేని గుణభూషణుడు తక్షణం శాపఫలితాన్ని అనుభవించటానికి అంతర్ధానుడై పోయాడు.

తమ తండ్రికి ఇంద్రునిద్వారా కలిగిన దుర్గతికి విలపిస్తూ, గుణభూషణుని పుత్రికలు పద్మగంధి, సుమగంధి, నానా విధాలుగా ఇంద్రుణ్ణి దూషించటం ప్రారంభించారు.

ఇంద్రుడా యువతులను కోపంతో చూస్తూ "భూలోకంలో మానవ జన్మలు పొంది, ఈతి బాధలకు తట్టుకోలేక అల్లాడిపోండి" అని వారికి కూడా శాపం ఇచ్చాడు.

తమ ప్రభువు, సేనాని, మంత్రి మొదలైన వాళ్లు, స్వర్గం వెళ్లినందున అక్కడేం జరుగుతున్నదోనని ఆందోళనతో అంతక్రితమే సుధర్మాభవనం దగ్గరికి వచ్చిన జయసేనుని మిత్రులు దండనాయకులు అయిన విద్యాధరవీరులు కొంతమంది, సభలో చెలరేగిన అన్యాయకాండకు కోపించి, కత్తులు దూసి ఇంద్రునిమీదికి వచ్చారు.





ఇంద్రుడా దళపతులను భూలోకంలో దేహబలం కలిగి, బుద్ధిబలంలేని ఏనుగులుగా జన్మించమని శాపం ఇచ్చాడు.

ఇంద్రుని దురాగతానికి కోపించిన విద్యాధర మంత్రి ఏదో మాట్లాడబోతూండగా - ఇంద్రుడతణ్ణికూడా భూలోకంలో మర్రి చెట్టువై పడి వుండమని శపించాడు.

ఇంద్రుని శాపం అనుభవింటానికి తక్షణం గుణభూషణుని పుత్రికలు, దండనాయకులు, మంత్రి, అంతర్థానమైపోయారు.

ఆ సమయంలో విద్యాధరుల దుడుకుతనం, ఇంద్రుని అక్రమ కోపప్రవర్తన, సభలో కలకలాన్ని కలిగించాయి.

బృహస్పతి ఆవిశేషాలన్నీ కళ్లారా చూస్తూ, ఏదో దీర్ఘంగా ఆలోచిస్తూ, మౌనంగా కూర్చుని వున్నాడు. అప్పుడు జరిగిన అన్యాయంకూడా హృదయాన్ని చీల్చివేస్తూండగా - జయసేన సేనాని ప్రళయకాల పరమేశ్వరునిలా గర్జించాడు. అతని గర్జనలు సుధర్మ నలుమూలలనుంచి ప్రతిధ్వనులను రేగించాయి. చింతామణిపీఠం మీది ఇంద్రుని కాళ్లు వణికాయి.

జయసేనుడు ఇంద్రునివేపు కరకు చూపులను ప్రసరించి, పళ్లు పటపట కొరికాడు.

ఆ తర్వాత అతడు సభా సదులారా! యమ వరుణ, కుబేర, వాయు, నైరుతి, ఈశాన్యాది అష్టదిక్పాలకులారా! సకల కళావిశారదుల సర్వవిద్యా పరిపూర్ణులు, ధర్మాధర్మ పరిజ్ఞా వేత్తలు అయిన బృహస్పతి భగవాను సమక్షంలో మా విద్యాధర రాజ్యానికి కలిగి ఘోరమైన అవమానం మీకందరికి చక్కగా అ మైందని భావిస్తున్నాం.

ధర్మం దిగజారి, అహంకారానికి బానిసి నిష్కారణ క్రోధానికి మా గౌరవాన్ని ఆహుతిచేసి అన్యాయ పరిపాలకుడైన ఈ ఇంద్రునికి పతన దాపురించింది.

మా రాజపుత్రి సౌశీల్యమే మా జీవితాల పెట్టని కోటగోడగా, మా శరీరాలకు కవచ నిలుస్తుంది. సృష్టి ప్రసాదించిన నా దివ్వా పరంపరలతోగాని, ఈ అధర్మ పరాయణు బుద్ధిరాదు.

మీరంతా ఇందులో గుణదోష నిరూపణ చే ఏది ధర్మమనిపిస్తే అది చేయండి. ఎవ

సహాయం చేయటం సమంజసమనిపిస్తే వారికి చేయండి—" అని మణిభూషణుని వైపు తిరిగి "దయచేయండి ప్రభూ! సామ, దాన, భేధాలు సమసినప్పుడు ఇక దండోపాయం తప్పనిసరి అయింది. చతురంగ బలాలను తరలించుకుని వచ్చి, ధర్మయుద్ధానికి తలపడుదాం. దైవబలం ధర్మానికే సహకరిస్తుందో, .అధర్మానికి ఆశ్రయం ఇస్తుందో, భవిష్యత్తులో లోకాలన్నిటికీ ఈ ఘట్టం తెలియజేస్తుంది" అని గిర్రున వెనుతిరిగి చరచరా ముందుకు నడవబోయాడు.

వెంటనే బృహస్పతి అతణ్ణి చెయ్యిపట్టుకుని నిలువరించాడు.

ప్రశాంతంగా అతణ్ణి చూస్తూ "వీరకుమారా! ఏ పనిచేసినా, ఏ మాటచెప్పినా, ముందు వెనుకలు ఆలోచించి, మంచిచెడులను చర్చించటం చాలా అవసరం. ఇన్నాళ్లూ స్వర్గలోకానికి కేవలం ఒక్క రాక్షసులతోనే ఇబ్బందులు కలుగుతూం డేవి. కాని, ఇప్పుడు దుర్విధివశాత్తూ, ఆత్మీయుల అంతఃకలహాలతోనే ఏదో వినాశం దాపురించేట్టు వున్నది. ఏది ఏమైనా ప్రస్తుత సమస్య నువ్వు భావించినంత విపరీత పరిస్థితిని చేరుకోవటం మేము సహించలేము. బృహస్పతి బుద్ధి వైశాల్యం ఈ విషయంలో కుచించుకుపోతే, అది దేవలోకాలకే అవమానం.

మీకు జరిగిన అధర్మకాండలోని ప్రతి చిన్న సంఘటనా నాకు తెలును!

శిష్యుడు చేసిన ఘోరపాపం గురువు మెడను చుట్టుకుని, ఆ దుష్కర్మ ఫలితాన్ని అనుభవింప జేస్తుందన్న సత్యాన్ని ఇంద్రుడు ఋజువు చేసేట్టున్నాడు.



శాంతించి ఇక కొద్దిసేపు ఓపికపట్టు. ఎవరె వరి జీవితాలు ఎటువంటి న్యాయాన్యాయాలను అనుభవిస్తాయో ఈశ్వరుడే నిర్ణయిస్తాడు" అని జయసేనున్ని చూసి అన్నాడు.

బృహస్పతి మాటలకు, అనునయానికి ఇంద్రుడు కటకటలాడుతూ "గురుదేవా! మా అపరాధాని మీరు ఆదరిస్తున్నారా?" అన్నాడు.

బృహస్పతి చివాలున ఇంద్రునివేపు తిరిగి "కాదు దేవేంద్రా! నిరపరాధిని సమాశ్వసిస్తున్నాను. దుఃఖితునికి సానుభూతి చూపించటం మానవ ధర్మంలోనే వున్నది. ఇక - దైవత్వం అనే ముసుగును తగిలించుకున్న మనమే పామరత్వాన్ని వహించటం పాడికాదు. ఈర్ష్య మనస్సులో వుంచుకోకుండా, నిష్పాక్షికంగా న్యాయ విచారణ చేయటం సిహాసనంమీద కూర్చున్న వారికి బాధ్యతాయుతమైన ధర్మం. ఏమంటావ్?" అన్నాడు.

బృహస్పతి ప్రశ్నకు ఇంద్రుడు మౌనముద్ర వహించాడు.

దేవగురువు "నువ్వు బదులు చెప్పకపోయినా, ఒప్పుకోకపోయినా, వాస్తవం అంతే" అన్నాడు.

ఇంద్రుడు బృహస్పతివేపు చూస్తూ "అయితే, ఇప్పుడు కర్తవ్యమేమిటంటారు?" అన్నాడు.

బృహస్పతి "న్యాయవిచారణం. నిరపరాధుల మీది నేరాల ఉపసంహరణ. శిక్షకు గురైన వారికందరికి న్యాయభిక్ష" అన్నాడు.

ఇంద్రుడు "గురుదేవా! ఒక న్యాయం ప్రకారం నిరపరాధులైన వాళ్లు, మరొక న్యాయం ప్రకారం అపరాధులు కాకూడదా?" అని ప్రశ్నించాడు.

సుధర్మాభవనంలో నువ్వుగింజ రాలినా శబ్దించే నిశ్శబ్దం అలుముకున్నది.

ఇంద్రునికీ, బృహస్పతికీ, వాదోపవాదాలుగా పరిణమించిన విద్యాధరుల సమస్య చివరికి ఏ రూపాన్ని ధరిస్తుందోనని సభికులంతా ఉత్కంఠతతో వారి సంభాషణను వినసాగారు.

(ఇంకావుంది)








ఒక రోజెందుకో వీరభద్రయ్యకు ఆరోగ్యం బాగాలేదు. మామూలుగానే ఆయనకు కోపం ఎక్కువ. ఆరోజది ...ట్టింపయింది.

వీరభద్రయ్య కొడుకు సూరయ్య అప్రయోజ...ుడు. ఏ పనీచేయని వాణ్ణి చూసి ఆరోజు ...పం పట్టలేక ఇంట్లోంచి పొమ్మన్నాడు వీరభద్రయ్య. ...్రి అలాగన్నందుకు పౌరుషపడి సూరయ్య ...ల్లొదిలి వెళ్ళిపోయాడు. వాడికోసం రోజంతా ...ుచూసి రాత్రికికూడా రాకపోయేసరికి తల్లి ...డి, "ఉత్త పుణ్యాన వాణ్ణి తిట్టావు. ...య్యాడో ఏమిటో?" అంటూ భర్తను ... దాంతో వీరభద్రయ్యకు ...న్నాడు.

...గాడు వాళ్ళింటి ... గట్టిగా అరిచాడు. ...య్య ఆ బిచ్చగాణ్ణి

జబ్బు చేత్తోతీసినట్లు మాయమయింది. ఒకపూట భోజనంచేయకపోవడంవల్లనే తన ఆరోగ్యం బాగుపడిందని అర్థమై వీరభద్రయ్య భార్యను పిలిచి జరిగింది చెప్పాడు.

"కోపం నీకు మేలేచేసింది కానీ మనబిడ్డను మనకు దూరంచేసింది. బైటకువెళ్ళి వాడేమయ్యాడో తెలుసుకునిరా" అంది వీరభద్రయ్య భార్య. ఆయన సరేనని బయల్దేరబోతూండగా గ్రామాధికారి వాళ్ళింటికి వచ్చి, "సైన్యంలో చేరడానికి యువకులు కావాలని రాజుగారు కబురంపారు. ఇష్టపడ్డవారిని కొందర్ని నిన్ననే రాజధానికి పంపాను. విచిత్రమేమిటంటే ఏ పనీ చేయడానికి ఒప్పుకోని మీ సూరయ్యకూడా తనూ సైన్యంలో చేరతానని వచ్చాడు నిన్న. వాణ్ణీ పంపాను" అని చెప్పాడు.

ఇదివిని వీరభద్రయ్య ఎంతో సంతోషించాడు. అప్పుడు ఇరుగుపొరుగు రాజ్యాలమధ్య శాంతి

భయంలేదు. ఆ దేశంలో సైనికులకుండే సదుపాయాలు. గౌరవం మరేదేశంలోనూ లేవు. సైన్యంలో చేరడంవల్ల కొడుక్కు క్రమశిక్షణ, మంచి నడవడి అలవడుతుందని వీరభద్రయ్య భార్యకు చెప్పాడు.

వీరభద్రయ్య భార్య అంతకు ముందురోజు మిగిలిన వంటంతా పనివాడిద్వారా రాత్రి తిట్టి తరిమేసిన బిచ్చగాడికి పంపేసింది. బిచ్చగాడు వాళ్ళకి పనివాడిద్వారా ఓ తాయెత్తుపంపి, అది దేవుడి మందిరంలో ఉంచితే ఇంటికే దుష్ట గ్రహాలూ పీడించవని చెప్పాడు.

ఈలోగా పక్కింటి రామభద్రయ్య వాళ్ళింటికి వచ్చి కోపం చాలా చెడ్డగుణం వీరభద్రయ్యా! నిన్న నీ కొడుకునింట్లోంచి పొమ్మన్నావుటగా, వాడు కోపంవచ్చి సైన్యంలో చేరాడుటగా!'' అన్నాడు.

నాకోపం నాకు మెలే చేసిందిలే! ఎందు పనికిరాడనుకున్న మా అబ్బాయి సైన్యంలో చేరా అన్నాడు వీరభద్రయ్య గర్వంగా.

"మా అబ్బాయీ ఎందుకూ పనికిరానివా అలాగని కోపంతో ఇంట్లోంచి పొమ్మంటావ వాణ్ణి నేను మంచిమాటలాడి నచ్చచెప్పి నిన సైన్యంలో చేరమని పంపాను. వాడు సంతోష వెళ్ళాడు. అక్కడే మీవాణ్ణీ చూశాను. వా మళ్ళీ నీముఖంచూడనని చెప్పాడు. నువ్వు వె స్వయంగా బ్రతిమాలుకుంటే తప్ప మళ్ళీ వా నీకళ్ళబడడు. అదే కోపంలేకుండా మంచ చెప్పి ఉంటే వాడు నీమీద ఎంతో గౌరవం ఉండేవాడు'' అన్నాడు రామభద్రయ్య.

"అవసరమైతే వెళ్ళి బ్రతిమాలుకుంట



న్నీ కోపంగురించి నాకు చెప్పకు. కోపంవచ్చి
ాత్రి భోంచేయలేదు. నా ఆరోగ్యం బాగు
డింది" అన్నాడు వీరభద్రయ్య.

"ముందుగా అనుకుని భోజనం మానేశావనుకో.
వరికీ ఏ మనస్తాపాలూ ఉండవు. నేను చాలా
లంగా రాత్రిపూట భోంచేయడంలేదు. అందు
ల్ల ఆరోగ్యానికి ఆరోగ్యం. ఆదాకు అదా! కానీ
న్న నీయింట్లో కోపంవల్ల చేసినవంటంతా మిగిలి
యింది. నీ కారణంగా ఆరోగ్యంగా ఉన్న
గతా వాళ్ళుకూడా భోజనాలుమాని ఇబ్బంది
డ్డారు. కోపం మేలుకంటె కీడే ఎక్కువ
స్తుంది."అన్నాడు రామభద్రయ్య.

"వంటమిగిలినా నష్టమేంలేదు. ఓ బిచ్చ
డికావంటంతా ఇస్తే వాడెంతో సంతోషించి
ష్టగ్రహాల్నిపోగొట్టే తాయెత్తు కూడాఇచ్చాడు"
న్నాడు వీరభద్రయ్య

"అరే, ఆ బిచ్చగాడా? నిన్నరాత్రి వాడికి
రించి భోజనంపెట్టామని ఎంతోసంతోషించి
వాడు మా పెరట్లో నిధిఉన్న చోటు చూపించాడు.
మీయింట్లో కూడా నిధి ఉందనీ ఆదరించి
ఏమైనా పెడితే మీకూ నిధిచూపిస్తాననీ మాతో
అన్నాడు. కానీ నువ్వు వాణ్ణి కోపంతో తిట్టి
తరిమేశావు. ఇంట్లో మిగిలిపోయిన వంట ఉండి
కూడా వాడికేమీ పెట్టకుండా మర్నాడు పాచి
పోయాక ఆ బిచ్చగాడికా వంటంతా పంపావు.
అందుకే వాడు నీకు నిధి చూపడానికి బదులు
తాయెత్తు ఇచ్చి ఊరుకున్నాడు. నిన్నటి
మాయింట్లో అంతా మిమ్మల్ని గమనిస్తూనే
ఉన్నాం. కోపంవల్ల నువ్వు చాలా నష్టపోయావు"
అన్నాడు రామభద్రయ్య.

ఆయన చెబుతున్నదంతా నిజమేనని తెలును
కున్నాక వీరభద్రయ్య కోపం తనకు లాభం
చేసిందన్న పొరపాటు అభిప్రాయం మార్చు
కున్నాడు. ఆ తర్వాత ఆయన తన కోపాన్ని
క్రమంగా తగ్గించుకుని, శాంతంగుణాన్ని అలవరచు
కుని, పూర్వంకంటే సంతోషంగా జీవించాడు.





# అందం

ఒక రాజుగారు చీటికీమాటికీ అనవసరంగా వ్యాకుల పడేవారు. అలాంటి సమయంలో ఎవరైన పలకరిస్తే చాలు. వాళ్ళమీద కస్సుమని లేచేవాడు. ఇది ఆయన పరివారానికి కంటకప్రాయంగా వున్నా, అతనితో చెప్పే ధైర్యం ఎవరికీ లేక పోయింది.

ఒకసారి దివాణానికి చిత్రకారుడైన పరదేశి ఒకడువచ్చి ఈ పరిస్థితిని ఆకళింపు చేసికొని "రాజా తమరికి అభ్యంతరం లేకపోతే మీ చిత్రాలు మూడు గీయాలని వుంది" అని అన్నాడు.

అందులో మొదటిది రాజుగారు నవ్వుతూ సంతోషంగా వున్నప్పటిది. రెండవది విషాదంలో మునిగినప్పటిది. మూడవది కోపంతో వున్నప్పటిది. మొదటి చిత్రం అందంగానూ, తక్కిన రెండూ ఒకదానికంటే మరొకటి వికారంగానూ ఉన్నట్లు రాజుగారికి తోచాయి.

చిరునవ్వుకు మించిన అందమైన ఆభరణం లేదని, అనవసరమైన దుఃఖానికంటే, అకారణ మైన క్రోధం ప్రమాదకరమైనదని రాజుగారికి అర్థమైంది. అటు తర్వాత ఆయన వ్యాకుల పడ్డంగానీ, అనవసరంగా ఎవరినీ కోపగించుకోవడం గాని జరగలేదు.

డా॥ తాటిచెర్ల గురురామప్రసాద్



# దేశసేవ

...మహేంద్ర వగరంలో ధనపతి అనే వ్యాపారస్తుడు ...ండేవాడు. ఆయన అన్నిరకాల వస్తువులూ ...మ్మి బాగా అర్జిస్తున్నాడు. సంపాదించిన ...బ్బును వడ్డీలకు తిప్పి రెట్టింపు చేస్తున్నాడు. ...ంటిపెరడు విశాలంగాఉంటే అక్కడ రకరకాల ...యగూరలు పండించి, ఇంటివాడకానికి పోగా ...గిలినవాటిని సంతకు పంపి అమ్మించేవాడు.

ఇలా తండ్రి రెండుచేతులా సంపాదిస్తుంటే ...డుకు శ్రీహరికి చేయడానికి బొత్తిగా ఏపనీ ...యింది.

...ఊరికే కూర్చోవడం ఇష్టంలేక వాడు తండ్రి ...గ్గరకువెళ్ళి, "మనకు బోలెడు డబ్బుంది కాబట్టి ...ట్లోపనులు నేను చేయక్కర్లేదు. దేశసేవ చేసి ...రుప్రఖ్యాతలు సంపాదించుకుందా మను ...ంటున్నాను" అని చెప్పాడు.

...క్కగా నొక్క కొడుకువి. అందుకని ఇంట్లో ...నులు చెప్పడంలేదు. నీ బుర్రలో తెలివి ...న్యం. అందుకే నీచేత వ్యాపారంవనులు చేయించడంలేదు. నీవంటివాడు దేశసేవకు పనికిరాడు. ఉన్నదాంతో తృప్తిపడి హాయిగా అనుభవించు" అంటూ ధనపతి కొడుకును మందలించాడు.

తండ్రి దేశసేవకు ఒప్పుకోడని శ్రీహరికి అర్థమైపోయింది. కానీ దేశసేవచేసి ఊరందరితో పాటు తండ్రి మెప్పుకూడా పొందాలన్న కోరిక వాడిలో నానాటికీ పెరిగిపోతూంది. అందుకని ఇంట్లో పద్దులు వ్రాసే గుర్నాథం దగ్గరకువెళ్ళి "దేశసేవ అంటే ఏమిటి?" అనడిగాడు

"నలుగురికీ పనికొచ్చేవనీ, పదిమంది కష్టనష్టాలు రూపుమాపే వనీ ఏదైనా దేశసేవే అనిపించుకుంటుంది" అన్నాడు గుర్నాథం.

శ్రీహరికి దేశసేవ అంటే తెలిసిపోయింది. వాడు వెంటనే ఇల్లొదిలి వీధులమ్మట తిరగ సాగాడు వాడికి చాలామంది బిచ్చగాళ్ళు, అసహాయులు కనిపించారు. వాళ్ళకష్టాలు తీర్చాలంటే డబ్బు కావాలి. శ్రీహరి దగ్గర అంత డబ్బులేదు.

వై.వి.వి. సత్యనారాయణ

అయినా డబ్బు దానాలకు ఖర్చుచేస్తే తండ్రి తిడతాడని వాడిభయం. డబ్బు ఖర్చులేకుండా దేశసేవ చేయాలని వాడి ఉద్దేశ్యం.

ఒక వ్యాపార కూడలివద్ద బాగా బలిసిన ఆంబోతొకటి విచ్చలవిడిగా తిరుగుతూ అందిన చోట్లలా కూరగాయలు, ఆకుకూరలు పళ్ళు తినసాగింది. దుకాణదారులు తమకు కలిగిన నష్టానికి ఆ ఆంబోతుపై చిరాకు పడుతూ దాన్ని అదిలిస్తున్నారు.

ఆంబోతు బారినుంచి దుకాణదారుల్ని రక్షించాలనుకున్నాడు శ్రీహరి. వాడు దారిన పోతున్న ఇద్దరు పనివాళ్ళను పిలిచి డబ్బిచ్చి ఆంబోతును తన ఇంటి పెరట్లోకి తోలించి, రాటకు కట్టించాడు ఆంబోతు యజమాని వెతుక్కుంటూ ఇంటికొస్తే ఆయన దగ్గర తను ఖర్చు పెట్టిన ధనాన్ని వసూలు చేసి గట్టిగా హెచ్చరించాలనుకున్నాడు శ్రీహరి. కానీ ఎవరూ ఇంటి రాలేదు. ఆంబోతు ఓ రాత్రివేళ కట్లు తెంచుకు పెరట్లోని కూరగాయల పాదులు పాడుచే పారిపోయింది.

మర్నాడుదయం జరిగిందంతా తెలి ధనపతి కొడుకుని పిలిచి, "ఓరి తెలివి తక్కు వెధవా! అది అచ్చోసి వదిలేసిన ఆంబోత దానికి యజమానంటూ ఎవరూ ఉండరు. దా వల్ల ఇబ్బంది పడేవాళ్ళు న్యాయాధికారికి ఫిర్యా చేసుకుంటారు. మధ్య నీకేమొచ్చింది? పెర పాదులన్నీ పాడుచేశావు కదా" అంటూ తీవ్రం మందలించాడు.

శ్రీహరికి తన తప్పు తెలిసింది. అయి వాడు దేశసేవ మానాలనుకోలేదు. ఈసారి వా



ధుల్లో తిరుగుతున్న రెండు గాడిదల్ని చూసి
ాటికి యజమాని ఉన్నదీ లేనిదీ వాకబు చేశాడు.
ివి ఊరి బయట ఉండే పెద్ద చాకలివి. చాకలి
ాడిదల చేత చాకిరీ చేయించుకుంటాడు తప్ప
ండిపెట్టడు. ఆ గాడిదలు ఊరిమీద పడి
ుస్తుంటాయి.

శ్రీహరి చాకలికి బుద్ధి చెప్పాలనుకున్నాడు.
ాడు గాడిదల్ని మళ్ళీ ఇద్దరు మనుషులచేత
ట్టించాడు. ఈసారి వాటిని పెరట్లో కాకుండా
నింట్లో ఎవరూ ఆట్టే వాడని ఓ కొట్టు గదిలో
ట్టించాడు. అక్కడైతే గాడిదలు పాడుచేయడాని
ు ఉండవని వాడి నమ్మకం.

సంగతి తెలిసి పెద్ద చాకలి లబోదిబోమంటూ
్చాడు. పదివరహాలు జరిమానా కట్టి మళ్ళీ
టిని ఊరిమీద వదలనని మాటిస్తే తప్ప
హరి గాడిదల్ని చాకలికివ్వనన్నాడు. పెద్దచాకలి
ాగే శ్రీహరికి పదివరహాలిచ్చి, గాడిదల్ని
ుకుపోయాడు.

శ్రీహరి తండ్రి వద్దకు వెళ్ళి జరిగింది గర్వంగా చెప్పాడు. కొడుకు గాడిదల్ని కొట్టు గదిలో ఉంచాడని తెలియగానే ధనపతి కంగారుపడి ఆ గదికి పరుగున వెళ్ళాడు. ఆ గదిలో గాడిదలు తిని పారేసిన కాగితం ముక్కలు చూసి, "ముదనష్టపు వెధవా! ఎవరికీ తెలియకుండా ఉంటుందని బాకీల పుస్తకాలన్నీ ఈ కొట్టు గదిలో దాచాను. లక్ష వరహాల అప్పు వివరాలన్నీ గాడిదల పాలు చేశావు కదురా!" అంటూ ఆవేశంలో కర్ర పుచ్చుకొని అదేపనిగా బాదాడు కొడుకుని. శ్రీహరి తల్లి వచ్చి ఆపేదాకా ఆయన ఆవేశం తగ్గలేదు.

తన తప్పేమిటో శ్రీహరికి అర్థమయింది. దేశసేవ చేస్తే తండ్రికి నష్టం వస్తుందని గ్రహించినా, వాడు మళ్ళీ దేశసేవ చేయలేదంటే కారణం వేరే ఉంది. ఎందుకంటే దేశసేవ పేరుచెప్పి తండ్రిదగ్గర చావుదెబ్బలు తినడానికి వాడు ఇప్పుడు సిద్ధంగా లేడు.





## ప్రశ్నలు

1. కంగారు' లాగా తన పొట్టమీద తిత్తిలో బిడ్డల్ని పెంచే జంతువు వున్నదా? ఉంటే అది ఏ దేశంలో కనిపిస్తుందో చెప్పగలవా?
2. అమెరికాలోని 'మిన్నెసోటా' రాష్ట్రంలో వున్న 99 సరస్సుల ప్రత్యేకత ఏమిటో తెలియజేయగలవా?
3. పీతల కాళ్ళు ఏదో కారణంచేత తెగిపోతే, మళ్ళీ కొత్త కాళ్ళు మొలుచుకొని వస్తాయంటారు. నిజమేనా?
4. ఆటంబాంబును ప్రేల్చినప్పుడు విడుదలయ్యే అణుశక్తి ఎంతుంటుందో తెలుసా?

1. ఉన్నది. దాని పేరు అపొసమ్. పెద్ద పంది కొక్కు లాగుండే ఈ జంతువు. దాదాపు పదిహేను కూనల్ని మోస్తూ వుంటుంది.
2. ఈ సరస్సుల పేర్లు కొండవీటి చేంతాడు లాగా పొడుగ్గా వుంటాయి. వాటిని వుచ్చరించటం కష్టం.
3. నిజమే.
4. అణువుల్లో నిక్షిప్తమై వున్న వెయ్యో వంతు శక్తి మాత్రమే విడుదల అవుతుంది. ఆ శక్తే మహా వినాశనానికి దారి తీస్తుందనటంలో సందేహం లేదు.



## జవాబులు

Edited and published by Vijaya Bapineedu, 80, Dhanalakshmi Colony, Madras-26. Phone : 422233 and Printed by N. Navin